

# భక్తి వేదాంత బుక్ ట్రస్ట్

అంతర్జాతీయ కృష్ణచైతన్య సంఘ సంస్థాపకాచార్యులు

పూజ్యశ్రీ ఏ. సి. భక్తివేదాంతస్వామి ప్రభుపాదులవారు





అంతర్జాతీయ కృష్ణచైతన్య సంఘ సంస్థాపకాచార్యులు 12391

పూజ్యశ్రీ ఏ. సి. భక్తివేదాంతస్వామి ప్రభుపాదులవారి

# కృష్ణప్రాప్తి మార్గము



## కృష్ణ చైతన్య మార్గము

1. ప్రామాణి కాధ్యాత్మిక విజ్ఞానమును హృదయ పూర్వకముగా అవలంబించుటచే మనము చింతా విముక్తులమై ఈ జీవిత కాలమందే విశుద్ధము, నిత్యము, ఆనందమయము అయిన జీవితమును పొంద గలుగుదుము.

2. మనము కృష్ణ భగవానుని అంశలైన శాశ్వత జీవాత్మలమే కానీ మన దేహములము కాము. అందుచే మన మందరము సోదరులము. కృష్ణుడు తద్వారా మనకందరికినీ సమాన జనకుడు.

3. కృష్ణుడు శాశ్వతుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, సర్వశక్తమంతుడు, సర్వమోహనుడు నయిన దేవాదిదేవుడు. అతడు సర్వ జీవులకును బీజప్రదుడైన జనకుడు. సర్వ జగత్సృష్టిని పోషించు దివ్యశక్తి.

4. ప్రపంచములోని గొప్ప మత గ్రంథము లన్నిటి యందును పరమ సత్యము గలదు. అయినను వైదిక గ్రంథములు మనకు తెలిసిన అతి ప్రాచీన వ్యక్త మత గ్రంథములు. వానిలో మరల భగవంతుని ప్రత్యక్ష వచనముల యథాతథ రూపమైన భగవద్గీత మిక్కిలి ప్రముఖమైనది.

5. మనము వేదవిజ్ఞానమును, నిస్వార్థుడు, కృష్ణుని మీద స్థిరముగ మనసును నిలిపినట్టి సద్గురువు నుండి నేర్చుకొనవలెను.

6. భుజించుటకు ముందు మనలను పోషించు ఆహారమును భగవంతునికి అర్పింపవలెను. అపుడు కృష్ణుడే ఆ నైవేద్యమై మనలను పవిత్రము చేయును.

7. మనము అన్ని వ్యాపారములను ఆత్మేంద్రియ తృప్తికి గాక, కృష్ణార్పణముగా చేయవలెను.

8. ఈ కలియుగమున పరిపక్వ భగవత్ప్రేమను పొందుటకు పవిత్ర భగవన్నామ సంకీర్తనమే సాధనముగా ఉపదేశింపబడినది. అందరికీ హరేకృష్ణ మహా మంత్రమును జపించుటయే సులభ విధానము.



హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే
హరేరామ హరేరామ రామరామ హరేహరే



# కృష్ణప్రాప్తి మార్గము

## ON THE WAY TO KRISHNA




హరే కృష్ణ హరే కృష్ణ
కృష్ణ కృష్ణ హరే హరే
హరే రామ హరే రామ
రామ రామ హరే హరే

1234

పూజ్యశ్రీ భక్తివేదాంతస్వామి ప్రభుపాదులవారి
రచనలు

* భగవద్గీత యథాతథము
శ్రీమద్భాగవతము 1-10 స్కంధములు (30 సంపుటములు)
శ్రీ చైతన్య చరితామృతము (17 సంపుటములు)
భగవాన్ శ్రీ చైతన్య శిక్షామృతము
భక్తిరసామృత సింధువు
* శ్రీ ఈశోపనిషత్తు
* గ్రహాంతర సులభయానము
దేవాదిదేవుడైన శ్రీకృష్ణుడు
దేవహూతి కుమారుడైన కపిలదేవుని ఉపదేశములు
కుంతీమహారాణి ఉపదేశములు
ఆత్మసాక్షాత్కార విజ్ఞానము
పరిపూర్ణమైన మార్గము
* కృష్ణచైతన్యం—అద్వితీయ వరప్రసాదం
* పునరాగమనము
* కృష్ణప్రాప్తి మార్గము
* జననమరణాతీతము
* కృష్ణచైతన్య ప్రతిపత్తి
* రాజవిద్య
* ఉపదేశామృతము
* ప్రాణము నుండి ప్రాణము
* యోగపరిపూర్ణత
కృష్ణచైతన్యము ఉత్తమోత్తమ యోగపద్ధతి
నక్షత్రపు గుర్తున్న పుస్తకములు తెలుగులో లభించు అవకాశమున్నది.

శ్రీ గురు గౌరాంగౌ జయతః

# కృష్ణ ప్రాప్తి మార్గము

## ON THE WAY TO KRISHNA


పూజ్యశ్రీ
ఏ.సి. భక్తి వేదాంతస్వామి ప్రభుపాదులు
అంతర్జాతీయ కృష్ణచైతన్య సంఘ సంస్థాపకాచార్యులు

అనువాదము :
డాక్టర్ తిరుమల రామచంద్ర
శ్రీ పెయ్యేటి గోపాలకృష్ణమూర్తి, ఎం. ఎ., ఎల్. టి.


౧౯౭౫






ప్రకాశకులు
భక్తి వేదాంత బుక్ ట్రస్ట్
హరేకృష్ణల్యాండ్
నాంపల్లి స్టేషన్‌రోడ్, హైదరాబాద్-500 001

## విషయసూచిక





# 1. సుఖమునకు రాజమార్గము

మనలో ప్రతి ఒక్కరము సుఖముకొరకు వెంపరలాడుచున్నాము. కాని, నిజమైన సుఖ మననేమో మనకు తెలియదు. సుఖమును గురించి యెంతయో ప్రకటించుట మనము చూచుచున్నాము. కాని, వాస్తవముగ చెప్పవలెనన్న సుఖముగా నున్నవారు చాలా కొద్ది మందియే అని తెలియును. అది ఎందువలన ననగా, నిజమైన సుఖము యొక్క స్థానము తాత్కాలిక వస్తువులకు అతీతమని తెలిసిన వారు చాల తక్కువ మంది. అర్జునునికి శ్రీకృష్ణుడు భగవద్గీతలో వివరించి చెప్పినది ఈ యథార్థానందమును గురించియే.

సాధారణముగ సుఖము మన జ్ఞానేంద్రియముల ద్వారా అనుభవింపబడుచున్నది. ఉదాహరణకు : రాతికి జ్ఞానేంద్రియములు లేవు. కాబట్టి సుఖదుఃఖానుభవము దానికి లేదు. వికాసము లేని చైతన్యము కంటె వికసించిన చైతన్యము సుఖ దుఃఖములను ఎక్కువ గాఢముగా గ్రహించగలదు. చెట్లకు చైతన్యము ఉన్నది ; కాని అది వికసించలేదు. అన్ని విధములగు వాతావరణములలోను చెట్లు చాలా కాలము నిలువగలవు. కాని, దుఃఖములను అనుభవించు అవకాశము వానికి లేదు. రెండు మూడు దినములు ఒక చెట్టువలె నిలబడి యుండుమని ఏ మానవునైనను అడిగినచో అతడు దానిని భరించలేడు. కాబట్టి సారాంశ మేమనగా, ప్రతిజీవియు తన చైతన్య వికాస స్థాయిని బట్టి సుఖదుఃఖానుభవమును పొందును.

ఈ భౌతిక ప్రపంచములో మనము అనుభవించు సుఖము నిజమైన సుఖముగాదు. ఒక చెట్టును 'నీవు సుఖముగ నున్నావా ?' అని

అడిగినచో, ఆచెట్టు మాట్లాడగలిగిన యెడల ‘అవును. నేను సుఖముగా నున్నాను. ఇక్కడనే సంవత్సరమంతయు నిలబడి గాలిని హిమపాతమును చాల బాగుగ ఆనందించుచున్నాను’ అని చెప్పవచ్చు. అది ఆ వృక్షమునకు సుఖము కావచ్చును. కాని, మానవజాతికైనచో, అది చాల నీచస్థాయి సుఖము. ప్రాణికోటిలో అనేక విధములును, అనేక శ్రేణులును ఉన్నవి కాబట్టి, వాని సుఖానుభవభావములలోను, అనుభూతులలోను కూడ అన్నివిధములైన ప్రకారములును, తారతమ్యములును ఉండును. ఒక జంతువు తన తోడి జంతువు చంపబడుటను చూచినను గడ్డి మేయుచునే పోవును. కారణమేమన తరువాత తనవంతు వచ్చుననది అర్థముచేసికొనుటకు కావలసిన జ్ఞానము దానికి లేదు. తాను సుఖముగా ఉన్నానని అనుకొనును గాని మరుక్షణమే అదికూడ చంపబడవచ్చును.

ఈ ప్రకారముగా సుఖములో హెచ్చుతగ్గులు అనేక విధములుగా నుండును. కాని అత్యుత్తమ (నిరతిశయ) సుఖ మేది ? శ్రీకృష్ణుడు అర్జునునితో ఇట్లనుచున్నాడు :

సుఖ మాత్యన్తికం యత్తద్ బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్
వేత్తి యత్ర న చైవాయం స్థితః చలతి తత్త్వతః

“అట్టి ఆనందస్థితిలో, అతడు దివ్యమైన ఇంద్రియములద్వారా అనుభవింపబడిన హద్దులేని దివ్యసౌఖ్యమునం దుండును. ఈ విధముగ ప్రతిష్ఠితుడై అత డెప్పుడును సత్యమును విడువడు.” (భ. గీ. 6.21)

బుద్ధియనగా తెలివి. సుఖము ననుభవింపగోరువాడు తెలివిగలవాడై యుండవలసి వచ్చును. పశువులకు నిజముగా వికసించిన బుద్ధి లేదు. కాబట్టి మనుష్యులవలె జీవితమును ఆనందింపజాలవు. మరణించిన మానవుని శవము నందుకూడ చేతులు, ముక్కు, కన్నులు, ఇంకను ఇతర జ్ఞానేంద్రియములు, అట్లే శరీరభాగము లన్నియును కనబడును.



కాని ఆ మనిషి సుఖము ననుభవింపలేడు. ఎందులకు అనుభవింపలేడు ? ఆ అనుభవించు శక్తి, ఆ చైతన్యాగ్నికణము లేచిపోయినది. కాబట్టి ఆ శరీరమునకు శక్తి లేదు. ఎవరైనను కొంచెము తెలివిగా ఈ విషయమును మరికొంచెము లోతుగా విచారించినచో అనుభవించునది దేహము కానేకాదనియు, లోపలనున్న ఆ చైతన్యాగ్నికణమే అనుభవించు చున్నదనియు అతనికి తెల్లమగును. ఈ శరీరములోని జ్ఞానేంద్రియముల ద్వారా ఆనందించుచున్నానని ఎవరైనను భావించినను, నిజమైన భోక్త ఆ చైతన్యకణమే. ఆ చైతన్య కణమునకు సుఖమును అనుభవించు సామర్థ్యమున్నది. కాని, పాంచభౌతికమైన ఆవరణముతో కప్పబడియుండుటవలన అది యెల్లప్పుడు వ్యక్తముకాదు. మనకు తెలియకపోయినను, ఆ చైతన్య లేశము దగ్గర లేనిచో, ఈ శరీరమునకు సుఖానుభవము సాధ్యముకాదు. ఒక అందగత్తె యొక్క శవమును ఒక మనుష్యునికి ఇచ్చినా మనుకొనుడు. అతడు దానిని స్వీకరించునా ? స్వీకరింపడు. కారణము ; చైతన్యకణము ఆ దేహమును విడి పోయినది. ఆ చైతన్య లేశము దేహములో నుండి ఆనందించుచు నుండుటయే కాక ఈ శరీరమును పోషించుచున్నది. ఈ చైతన్య స్ఫులింగము విడిచిపోగానే శరీరము క్రుళ్ళి చెడి పోవును.

జీవుడు ఆనందించుచున్నా డనగా, వానికి జ్ఞానేంద్రియములు కూడ వుండవలెనన్నమాట. లేనిచో అత డెట్లానందించగలడు ? పరిమాణములో జీవాత్మ అణువేయయినను నిజముగ అనుభవించు చున్నది అతడే యని వేదములు కూడ బలపరచుచున్నవి. ఆత్మను కొలచుట గాని, తూకము వేయుటగాని సాధ్యము గాదు. అయితే, అంత మాత్రమున దానికి పరిమాణము లేదని అర్థము కాదు. ఒక పదార్థము మనకు ఒక చిన్న చుక్కకంటె పెద్దదిగ కనుపించక పోవచ్చును. దాని వెడల్పు పొడవులు కూడ కనబడక పోవచ్చును. కాని సూక్ష్మదర్శినిలో

చూచినచో, దానికి కూడ పొడుగు వెడల్పులు కనబడును. ఆ విధముగానే జీవాత్మకును ఆయతనములున్నవి. కాని, మనకు కనబడవు. మనము దుస్తులను కొన్నప్పుడు అవి మన శరీరమునకు సరిపోవునట్లు చేయబడును. చైతన్యాగ్నికణమునకు ఒక రూపము ఉండితీరవలెను. అట్లుకానిచో ఈ భౌతికశరీరము దానికి సరిపోవునట్లు పెరుగుట యెట్లు? కాబట్టి, సారాంశమేమనగా, ఆ చైతన్యాగ్నికణము నిరాకారము కాదు. అది నిజముగ ఒక పురుషుడు, దేవదేవుడు సాక్షాత్తు ఒక పురుషుడు. జీవాత్మ దేవదేవుని అంశస్వరూపమైనందున అతడు కూడ ఒక పురుషుడే. తండ్రికి నిజస్వరూపము, వ్యక్తిత్వము ఉన్నచో, కొడుకునకు కూడ అవి ఉన్నట్లే. అట్లే కొడుకునకు అవి ఉన్నచో తండ్రికిని ఉన్నట్లు మన మూహింపవచ్చును. కాబట్టి దేవదేవుని పుత్రులమై యుండి మన స్వరూప వ్యక్తిత్వములను ఒక వైపు నిలబెట్టుకొనుచు మరియొక వైపు అవి దేవదేవుడైన మన తండ్రికి లేవనుట యెట్లు ?

'అతీంద్రియమ్' అనగా, నిజమైన ఆనందమును రుచిచూడ గలుగుటకు ముందు, ఈ లౌకికములు అనిత్యములునగు ఇంద్రియ (విషయ) సుఖములకు అతీతులము కావలసియున్నది అన్నమాట. 'రమన్తే యోగినోఽనన్తే సత్యానంద చిదాత్మని' ఆధ్యాత్మిక జీవితమును సాధింపగోరు యోగులు కూడ లోపలనున్న పరమాత్మపై కేంద్రీకరించుటవలననే ఆనందమును రుచిచూచుచున్నారు. అందులో సుఖముగాని ఆనందము గాని లేనిచో ఇంద్రియ నిగ్రహము కొరకు అన్ని యిడుమలు పడుటలో అర్థమేమున్నది ? అంత కష్టపడి యోగులు రుచి చూచునట్టి సుఖము ఎట్టిది ? ఆ సుఖము అనంతము-అంతము లేనిది. అదెట్లు ? జీవాత్మ నిత్యుడు. దేవదేవుడు నిత్యుడు. కాబట్టి వారిద్దరి మధ్య పరస్పర ప్రేమానురాగముల ఆదాన ప్రదానములు కూడ శాశ్వతములు. నిజముగా తెలివిగలవాడు ఈ భౌతికకాయమునకు సంబంధించినట్టియు,



చంచలమైనట్టియు విషయ సుఖములజోలికి పోడు ; ఆధ్యాత్మిక జీవన సుఖముపై తనదృష్టి నిలుపును. ఆధ్యాత్మిక జీవనములో జీవాత్మ దేవదేవునితో పాల్గొనుటను 'రాసలీల' అందురు.

బృందావనములో గోపికా స్త్రీలతో కృష్ణుని 'రాసలీల'ను మనము తరచు వినియున్నాము. అది ఈ భౌతికకాయముల మధ్య జరిగెడి సాధారణమగు సంబంధముల వంటిది కాదు ; అది అలౌకిక దేహముల ద్వారా భావానుభవముల వినిమయము. దీనిని గ్రహించుటకు కొంత తెలివితేటలు గలవాడయి యుండవలెను. నిజమైన ఆనంద మేదియో తెలిసికొన లేని మూర్ఖుడైతే, భౌతిక ప్రపంచములోనే సుఖము నపేక్షించును. చెఱకుగడ ఏమియో ఎరుగని ఒక మనిషిని గురించి భారత దేశమున ఒక కథ చెప్పికొందురు. అది నమలినచో చాలా తియ్యగా నుండు నని అతనికి ఎవరో చెప్పినారట. 'అటులనా ? అది ఎట్లుండును ?' అని అడిగినాడట. 'అది వెదురుగడవలె నుండును.' అని ఒకరు చెప్పిరట. అంతట అతడు కనబడిన ప్రతి వెదురు ముక్కను నమలుట మొదలు పెట్టెను. అట్టి పరిస్థితిలో చెరకు తీపిని ఆనందించుటకు అతని కెట్లు సాధ్య మగును ? అదేవిధముగ మనము సుఖములను, ఆనందమును సంపాదించుటకు ప్రయత్నించు చున్నాము. ఏ విధముగా ? ఈ భౌతిక శరీరమును వినియోగించుట ద్వారా. అందువలన సుఖమును లేదు, ఆనందమును లేదు. తాత్కాలికముగా సుఖానుభవము కొంచెము కనబడవచ్చును. కాని, అది నిజమైన సుఖముగాదు ; అనిత్యము కాబట్టి. అది ఆకాశమున తళుక్కుమని మెరసినట్లుగా మనకు ఒక క్షణము కనబడు మెరుపువంటిది కాని, నిజమైన మెరుపు అది కానేకాదు. మనుష్యనికి నిజముగా ఆనందమననేమో తెలియదు. కాబట్టి నిజమైన ఆనందము నుండి వైదొలగి పెడదారిని బడుచున్నాడు.

నిజమైన సుఖము నందు తనను స్థాపించుకొనుటకు జరుగవలసిన

ప్రవృత్తి కృష్ణచైతన్య విధానము, కృష్ణచైతన్యము వలన మనము క్రమముగా సద్బుద్ధిని వృద్ధి పరచుకొని, ఆధ్యాత్మిక ప్రగతితో ఆత్మానందాస్వాదన సుఖమును సహజముగా పొందగలము. ఆత్మానందాస్వాదనమును ప్రారంభించిన తర్వాత అనుగుణ నిష్పత్తిలో భౌతిక విషయ సుఖమును వదలి వేయుచుందుము. పరమార్థ సత్యమును తెలిసికొనుటలో మనము ముందడుగు వేయుచున్నకొలది ఈ అసత్యసుఖమందు మన ఆసక్తి తగ్గుచుండును. ఏదోవిధముగా ఎవరైనను ఈ కృష్ణ చైతన్య స్థాయికి రాగలిగినచో ఫలిత మేమిటి ?

*యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః*
*యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే*

"దీనిని పొందినతర్వాత అతడు అంతకంటె అధికతరమైన లాభమింకొకటి లేదని తలంచును. అట్టిస్థితిలో నున్నపుడు మహత్తరమైన దుఃఖముల నడుమకూడ అతడెప్పుడును చలింపడు." (భ. గీ. 6.22)

ఎవరైనను ఆదశకు వచ్చినప్పుడు ఇతర సిద్ధులు నిస్సారముగా కనిపించును. ఈ భౌతిక ప్రపంచములో మనము ఎన్నో విషయములను సాధించుటకు ప్రయత్నింతుము—ధనము, స్త్రీలు, కీర్తి, సౌందర్యము, పాండిత్యము మొదలగునవి. కాని, మనము కృష్ణభావనలో ప్రవేశింపగానే 'ఓహ్ ! ఇంత కంటె ఉత్తమమైన సిద్ధి లేదుగదా!' అనుకొందుము. కృష్ణ చైతన్యము ఎంత శక్తిమంతమనగా దాని యొక్క స్వల్పమైన రుచికూడ మహావిపత్తునుండి మనలను రక్షించును. కృష్ణ చైతన్యాస్వాదనము పొందినది మొదలు ఇతరానందములు, సిద్ధులు అనబడునవి అన్నియును నిస్సారములుగాను, రసహీనములుగాను కనబడుట మొదలిడును. కృష్ణ చైతన్యమునందు ఎవరైనను దృఢముగా నిలిచిపోయినచో, భయంకర విపత్తులు కూడ అతనిని చలింపజేయజాలవు. భౌతిక ప్రపంచము అపదలకు, అపాయములకు స్థానముకాబట్టి జీవితములో అపదలెన్నియో వచ్చును. వీనిని చూడనట్లు మనము కన్నులు మూసికొందుము. మనము మూర్ఖులము కాబట్టి ఆ అపదలను సర్దుకొనిపోవుటకు ప్రయత్నింతుము. జీవితములో మనకు ఎన్నో ఆపదలు రావచ్చును. కాని, కృష్ణచైతన్యములో శిక్షణపొంది తిరిగి స్వగృహమగు దేవదేవుని వద్దకు వెళ్ళుటకు ప్రయత్నించినచో మనము ఆ ఆపదలను లెక్కచేయము. అప్పుడు మన వైఖరి 'ఆపదలు వచ్చును', పోవును. కాబట్టి అవి సంభవించిన సంభవించనీ ! —అన్నట్లుండును. భౌతిక వేదికపై నుండి, నశ్వర వస్తు నిర్మితమైన ఈ స్థూలశరీరముతో తాదాత్మ్యము కలిగియున్నంతకాలము ఆ విధమగు సర్దుబాటు చేసికొనుట కష్టతరము. కాని కృష్ణచైతన్యమునందు ముందుకు సాగిపోవుచున్నకొలది ఈ భౌతికబంధముల నుండియు దేహసంబంధము లైన నామరూపాద్యుపాధులనుండియు ముక్తుడగుచుండును.



శ్రీమద్భాగవతములో భౌతిక ప్రపంచము ఒక మహా సముద్రముతో పోల్చబడినది. ఈ భౌతిక విశ్వములోపల కోట్లకొలది గ్రహములు అంతరిక్షమున తేలుచున్నవి. ఇక అట్లాంటిక్, పసిఫిక్ సముద్రముల వంటివి అక్కడ యెన్ని యున్నవో మన మూహించుకొనవచ్చును. నిజమునకు భౌతిక విశ్వమంతయును జననమరణముల సముద్రమగు ఒక మహా దుఃఖసముద్రముతో పోల్చబడినది. ఈ అజ్ఞాన మహాసముద్రము దాటుటకు ఒక దృఢమైన నావ కావలెను. ఆ నావయే శ్రీకృష్ణ పాదపద్మము. మనము వెంటనే ఆ నావ యెక్కవలెను. కృష్ణపాదములు చిన్నవి యనుకొని మనము జంకరాదు. ఈ విశ్వమంతయు ఆయన యొక్క పాదముమీదనే నిలిచియున్నది. ఆయన పాదము నాశ్రయించిన వానికి ఈ భౌతిక మహాసముద్రము ఒక ఆవుదూడ గిట్టలో ఏర్పడిన

గుంటలో నిలచిన నీళ్ళకన్న విశిష్టముగా కనబడదు. నిజముగా అటు వంటి నీళ్ళగుంటను దాటుట ఏమంత కష్టము కాదుగదా।

*తం విద్యాద్ దుఃఖసంయోగ వియోగం యోగ సంజ్ఞితమ్*

"భౌతిక సంపర్కములచే కలుగు దుఃఖములనుండి పొందబడు నిజమైన మోక్షమిదియే." (భ.గీ. 6.23)

ఇంద్రియ నిగ్రహము లేకపోవుట వలననే మనము భౌతిక ప్రపంచములో చిక్కుకొని యున్నాము. యోగపద్ధతి ఇంద్రియములను జయించుటకే ఏర్పడినది. ఇంద్రియములను ఏదో విధముగ జయింప గలిగితే, అప్పుడు మనము నిజమైన ఆత్మానందమువైపు ఉన్ముఖులమై జీవితములను సార్థకము చేసికొనవచ్చును.

*స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽ నిర్విణ్ణ చేతసా*
*సంకల్ప ప్రభవాన్కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః*
*మనసైవేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః*
*శనైః శనై రుపరమేద్ బుద్ధ్యా ధృతిగృహీతయా*
*ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చిదపి చిన్తయేత్*
*యతో యతో నిశ్చలతి మన శ్చఞ్చల మస్థిరమ్*
*తత స్తతో నియమ్యైతద్ ఆత్మన్యేవ వశం నయేత్*

"మానవుడు నిశ్చయముతోడను, విశ్వాసముతోడను యోగాభ్యాసము నందు మగ్నుడై ఆ మార్గమునుండి తొలగిపోరాదు. మానసిక కల్పనల వలన పుట్టిన అన్ని భౌతికములైన కోరికలను నిరపవాదముగా విడిచి మనస్సుచే అన్నివైపులనుండి సర్వేంద్రియములను నిగ్రహింపవలెను. క్రమముగా మెల్లగా దృఢమైన నమ్మికతో కూడిన బుద్ధితో మానవుడు



సమాధిస్థితిని పొందవలెను. ఈ విధముగా మనస్సును ఆత్మయందే స్థిరముచేసి మరి దేనిని గూర్చియు తలపరాదు. చంచలమైనట్టియు, అస్థిరమైనట్టియు స్వభావము కలిగి యుండుటచే మనస్సు ఎచ్చటెచ్చటి నుండి పరిభ్రమించుచున్నను మానవుడు దానిని తప్పక మరలించి ఆత్మవశమునకు తిరిగి తీసికొని రావలయును." (భ.గీ. 6.23-26)

మనస్సు ఎల్లప్పుడును కల్లోలితముగనే ఉండును. అది ఒకసారి యిటు, ఒకసారి అటు పరుగెత్తును. యోగాభ్యాసము వలన మనము మన మనస్సును కృష్ణచైతన్యమువైపు అక్షరాల లాగుకొని పోవుదుము. అనాదిగా జన్మజన్మలుగా అభ్యాసవశమున మన మనస్సు కృష్ణ చైతన్యమునుండి వైదొలగి బాహ్య పదార్థములవైపు పోవును. ఈ కారణము వలన కృష్ణచైతన్యముపై మనస్సును కేంద్రీకరించుటకు ఎవరైనను ప్రయత్నించినచో, మొదట చాల కష్టముగా నుండవచ్చును; కాని, ఆ ఇబ్బందు లన్నింటిని దాటవచ్చును.

కృష్ణునిమీద నిలువక మనస్సు అశాంతముగా నుండును గాన అది ఒక ఆలోచననుండి మరియొక ఆలోచనకు పరుగిడుచుండును. ఉదాహరణమునకు మనము ఒక పనిమీద నున్నప్పుడు పది, ఇరువది, ముప్పది, నలుబది సంవత్సరముల క్రిందట జరిగిన సంఘటనలు అకస్మాత్తుగా, అకారణముగా మనస్సునకు వచ్చును. ఈ ఆలోచనలు మన మనస్సుయొక్క అడుగు భాగమునుండి వచ్చును అవి ఆ విధముగ పైకి వచ్చుచునే యుండును. గాన మనస్సు ఎల్లప్పుడును అశాంతిగానే యుండును. మన మొక సరస్సునుగాని, చెరువును గాని అల్లకల్లోలము చేసినచో అడుగునన్న బురద, నీటి పై భాగమునకు తేలును. అదే విధముగ మనస్సు కల్లోలముగ నున్నచో దాని అడుగునుండి కొన్ని యేండ్ల తరబడి పడియున్న ఆలోచనలు పైకి వచ్చును. చెరువును అల్ల కల్లోలము చేయనిచో బురద అడుగునకు దిగిపోయి యుండును. ఈ

యోగాభ్యాసము మనస్సును శాంతింపజేయుటకును, ఆలోచనలనన్నింటిని అణచివేయుటకును పనికివచ్చును. ఆ కారణము వలననే మనస్సులో కల్లోలము లేకుండా జేయుటకు అనేక నియమము లేర్పడినవి. ఆ నియమములను మన మనుసరించినచో, క్రమక్రమముగా మనస్సు స్వాధీనమగును. అనేక విధులు, అనేక నిషేధములు ఉన్నవి. మనోనిగ్రహము నిజముగా కావలెనన్నచో ఆ నియమములను అనుసరింపవలెను. కాని, ఎవరైనను తిక్కగా ప్రవర్తించినచో మనోనిగ్రహమునకు అవకాశ మెక్కడిది ? అది ఎట్లు సంభవించును ? కృష్ణుని దప్ప ఇతరమును గురించి ఆలోచింపని దశవరకు మనస్సునకు పూర్తిశిక్షణ నిచ్చినచో, దానికి నిశ్చలత్వము, ప్రశాంతి ఏర్పడును.

*ప్రశాన్త మనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్*
*ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూత మకల్మషమ్*

"నామీద మనస్సు లగ్నముచేసిన యోగి నిక్కముగ దివ్య సౌఖ్యముయొక్క అత్యుత్తమ పరిపూర్ణత్వమును పొందును. అతడు రజోగుణమున కతీతుడై బ్రహ్మముతో తనకు గల గుణైక్యమును గుర్తించును. ఈ విధముగ అతడు పూర్వకర్మముల సర్వఫలములనుండి విముక్తుడగును." (భ. గీ. 6 27)

సుఖముకొరకు మనస్సు నిరంతరము అనేక విషయములను కల్పించుకొనును. "అది నాకు సుఖమిచ్చును, ఇది నాకు సుఖమిచ్చును. సుఖ మిక్కడ ఉన్నది. సుఖ మక్కడ ఉన్నది." అని అనుకొనుచుండును. ఈ విధముగ మనస్సు మనలను అక్కడికి ఇక్కడికి తీసికొని వెళ్ళును. కళ్ళెములేని గుఱ్ఱముల రథముపై మనము స్వారి చేయుచున్నట్లుండును. మన గమ్యస్థానముపై ఏవిధమైన అధికారమును లేదు. మహాభీతితో అసహాయులమై ఊరకయే రథముపై కూర్చుండి చూచు



చుండ వలసినవారమే. మన మనస్సు కృష్ణచైతన్య మార్గమున—ముఖ్యముగ "హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే, హరేరామ హరేరామ రామరామ హరేహరే" అని పాడుచు-లగ్నమయిన వెంటనే మన రథముయొక్క పొగరుబోతు గుఱ్ఱములు క్రమక్రమముగా మన స్వాధీనములోనికి వచ్చును. మన జీవితములో ప్రతిక్షణము కృష్ణసేవయందు గడుపవలెను. అట్లయినచో ఎదురు తిరిగి అల్లరిగా ప్రవర్తించు ఈ గుఱ్ఱములు అనిత్య భౌతిక సుఖములను వెదకుచు ఒక విషయము నుండి మరియొక విషయమునకు వృథాగా లాగికొనిపోవు.

*యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః*
*సుఖేన బ్రహ్మ సంస్పర్శం అత్యన్తం సుఖ మశ్నుతే*

"ఈ విధముగ ఆత్మనిగ్రహముగల యోగి సర్వదా యోగాభ్యాసమునందు మగ్నుడై సర్వభౌతిక కాలుష్యములనుండి ముక్తుడగును. అతడు భగవంతుని ప్రేమయుక్తమైన దివ్యసేవలో సంపూర్ణ సౌఖ్యముయొక్క అత్యుత్తమ స్థితిని పొందును." (భ. గీ. 6.28)

తన యందు భక్తిగల వానియెడ కృష్ణుడు వాత్సల్యము గలిగి రక్షకుడుగా నుండును. ఎవరికైనను ఆపద సంభవించి నప్పుడు అతని రక్షకుడు అతనిని రక్షించును. భగవద్గీతలో చెప్పినట్లు కృష్ణుడు సర్వభూతములకు నిజమైన మిత్రుడు కాబట్టి మనము ఆయనతోడ మైత్రిని మరల ఏర్పరచుకొనవలెను. దాని పునరుజ్జీవన మార్గమే కృష్ణచైతన్య మార్గము. కృష్ణచైతన్యాభ్యాసము వలన లౌకిక తీవ్రవిషయానుధావనము (భౌతిక విషయములవెంట ఆవేశముతో పరుగెత్తుట) ఆగిపోవును. ఆ తీవ్రవిషయవాంఛయే మనలను కృష్ణునినుండి దూరము చేయుచున్నది. కృష్ణుడు మనలోనే ఉన్నాడు. మనము తనవైపు తిరుగుటకొరకు వేచియున్నాడు. కాని భౌతిక విషయవాంఛయనెడి వృక్షముయొక్క ఫలము

లను తినెడి ఆవేశములో మనము ఆ సంగతియే పట్టించుకొనుట లేదు ఈ ఫలములను తినుటకు కారణమైన బలవంతపు ఉద్రేకము ఆగిపోయి మనమును శుద్ధాత్మయగు బ్రహ్మతో నిజమగు తాదాత్మ్యమును పొంద వలెను.

# 2. కృష్ణసంకీర్తన, జ్ఞానముల మార్గము

హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే
హరేరామ హరేరామ రామరామ హరేహరే

ఇది దివ్యనాద ప్రకంపనము. ఇది మన మనస్సను అద్దము మీద పడిన దుమ్మును తుడిచివేయును. వాహనముల అత్యధికమగు రాకపోకలవలన న్యూయార్కు మహానగరము రెండవఎవెన్యూలోని ప్రతి వస్తువు మీద దుమ్ము దట్టముగా పేరుకొని ఉన్నట్లు ఈ సమయమున మన మనస్సు లను స్వచ్ఛములైన అద్దములమీద భౌతిక విషయాసక్తియను ధూళి, మసి ఎంతో పేరుకొని యున్నది. తత్ఫలితముగా మనము వస్తువుల నిజమైన స్వరూపమును కనుగొనలేక పోవుచున్నాము. ఈ లోకోత్తరనాద ప్రకం పనము (హరేకృష్ణ మహామంత్రము) ఆ దుమ్మును, మసిని తుడిచివేసి మనము మన వాస్తవ స్వరూపమును స్పష్టముగా చూచునట్లు చేయును. "ఈ శరీరము నేను కాదు నేను జీవాత్మను, చైతన్యము నా లక్షణము" అని మనకు తెలిసిన వెంటనే, మనము నిజమైన సుఖమునందు స్థిరపడె దము. ఈ హరేకృష్ణ కీర్తనముచేత మన బుద్ధి శుద్ధముకాగా, మన భౌతిక దుఃఖములన్నియు మాయమై పోవును. ఈ భౌతిక ప్రపంచము పైన ఎల్లప్పుడును మండుచుండెడి అగ్ని ఉన్నది. దానిని ఆర్పివేయుటకు ప్రతివాడును ప్రయత్నించుచున్నాడు. కాని భౌతిక స్వభావముగల ఈ దుఃఖాగ్నిని చల్లార్చుటకు, మనము ఆధ్యాత్మిక జీవితమున శుద్ధచైతన్య ములో చేరకపోయినచో సాధ్యము కాదు.

అన్నిప్రాణులయొక్క భౌతికదుఃఖాగ్నిని ధర్మసంస్థాపనద్వారా చల్లార్చుట శ్రీకృష్ణావతారముయొక్క ప్రయోజనములలో నొకటి.

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాఽత్మానం సృజా మ్యహమ్
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే

"ఓ భరత వంశజా ! ఎప్పుడైతే, ఎక్కడైతే మతాచార క్షీణదశ జరుగుచు అధర్మము అభివృద్ధి చెందునో అప్పుడు నేను అవతరించుచుందును. సజ్జనులను సంరక్షించుటకును, దుర్మార్గులను నశింపజేయుటకును, ధర్మము తిరిగి స్థాపించుటకును ప్రతి యుగమునందును నేను అవతరించుచుందును." (భ. గీ. 4. 7,8)

ఈ శ్లోకములలో 'ధర్మము' అను మాట ప్రయోగింపబడినది. ఈ పదము ఆంగ్లభాషలోనికి అనేక విధములుగా అనువాదము చేయబడినది. ఒక్కొక్కసారి దానిని "ఫెయిత్" అనగా మత విశ్వాసము అనినారు. కాని, వైదిక సాహిత్యమును బట్టి ధర్మము అనగా ఎలాటి మత విశ్వాసము కాదు. మతము మారవచ్చును ; కాని ధర్మము మారదు. మారినచో ! ఉదాహరణమునకు నీరు గడ్డకట్టుకొని పోయిన దనుకొనుడు. అది నిజముగా తన ద్రవస్వభావమును కోల్పోయిన దన్నమాట. అది ఒక విశిష్టస్థితిలో ఆ దశలో నున్నది. మన ధర్మము లేక స్వరూపస్థితి యేమనగా, పరబ్రహ్మములో అంశమగుట. ఇట్లయినప్పుడు మనము మన చైతన్యమును దేవదేవుని వశము చేయవలెను.

ఈ పరిపూర్ణ పరబ్రహ్మమునకు చేయబడు లోకాతీత సేవాభావము భౌతిక విషయసంపర్కము వలన దుర్వినియోగ మగుచున్నది. సేవాభావ మనునది మన మూలస్వరూపమునందే యిమిడియున్నది. ప్రతివాడును సేవకుడే. స్వామి ఎవడును కాదు. ప్రతివాడు ఎవరినో ఒకరిని సేవించుచునే యున్నాడు. దేశాధ్యక్షుడు దేశములోని కార్య



కర్తల కందరికిని నాయకుడైనను, తాను కూడ దేశమును సేవించుచున్నాడు అతని సేవలతో ఇక పని లేనప్పుడు దేశ మతనిని తొలగించును. "నేను చూచునట్టి సర్వమునకును ప్రభువును" అనుకొనుట మాయ. ఈ విధముగ మన సేవాభావము అనేకోపాధుల రూపములతో దుర్వినియోగ మగుచున్నది. ఈ ఉపాధుల నుండి మనము విముక్తులమైనపుడు, అనగా మన మనోదర్పణములమీది మసి తొలగిపోయినపుడు మనము కృష్ణుని యొక్క నిత్యసేవకులమను మన నిజస్థితిని తెలిసికొనగలిగెదము.

భౌతిక ప్రపంచమున తాను చేయు సేవయును, ఆధ్యాత్మిక వాతావరణమున చేయు సేవయును ఒకటియేయని ఎవ్వరును భావింపరాదు. 'మోక్షము వచ్చిన తరువాత కూడ నేను సేవకుడనుగనే ఉందునా? ' అని మనము సంకోచము పడవచ్చును. దానికి కారణము భౌతిక ప్రపంచములో మన సేవలలో ఎక్కువ సుఖము లేకుండుట. కాని, దివ్యసేవ అటువంటిది కాదు. ఆధ్యాత్మికలోకమున స్వామి, భృత్య భేదము లేదు. ఇక్కడ భేదమున్నది : కాని, దివ్య ప్రపంచమున ప్రతి వస్తువు ఒక్కటే. ఉదాహరణకు భగవద్గీతలో కృష్ణుడు అర్జునునికి సారథ్యము చేయు సేవకుని స్థానమున నుండుట మనము గమనించగలము. తన సహజస్థితిలో అర్జునుడే కృష్ణుని సేవకుడు. కాని, ప్రవర్తనలో, కొన్ని సమయములలో స్వామియే తన సేవకులకు సేవకుడగుట మనము చూచుచున్నాము. కాబట్టి భౌతిక భావములను ఆధ్యాత్మిక సామ్రాజ్యమునకు తీసికొని రాకుండునట్లు మనము జాగ్రత్తపడవలెను. భౌతిక ప్రపంచములో మన మనుభవించు ప్రతి విషయమును ఆధ్యాత్మిక జీవితపు వికృత ప్రతిబింబమే.

మన సహజస్థితి — అనగా ధర్మము భౌతికపదార్థ సంపర్క దోషముల వలన చెడిపోయినప్పుడు దేవదేవుడు స్వయముగా అవతరిం

చును. లేదా తన ఆంతరంగిక పరివారములో నెవరినైనను పంపును. ఏసుక్రీస్తు ప్రభువు తాను "దేవుని కుమారుడ"నని చెప్పికొనెను. కాబట్టి అతడు దేవదేవుని ప్రతినిధి. అ విధముగనే మహమ్మదు తనను దేవ దేవుని సేవకునిగా భావించుకొనెను. ఈ విధముగ మన స్వభావస్థితిలో కల్లోలము కలిగినపు డెల్ల దేవదేవుడు స్వయముగా నైనను అవతరించును, లేదా మనకు జీవుల యథార్థ స్థితిని గురించి చెప్పుటకు తన ప్రతినిధినైనను పంపును.

కాబట్టి, ధర్మము అనునది ఎవరిచేతనో నిర్మింపబడిన మత విశ్వాసమని ఎవరును పొరపడరాదు. ధర్మము అను మాట అర్థమును బట్టి చూచినచో ధర్మమును జీవాత్మనుండి ఎప్పుడును వేరుచేయలేము. తీపిరుచి చక్కెర కెటువంటిదో, ఉప్పన ఉప్పున కెట్లో, ఘనత్వము రాతి కెట్లో, అది (ధర్మము) జీవునికి అటువంటిది. ఎట్టి పరిస్థితులలోను దానిని విడదీయుట అసంభవము. జీవాత్మ ధర్మము సేవ, ప్రతిప్రాణికిని తనకో మరియొకరికో సేవచేయు మనఃప్రవృత్తి ఉన్నదని మనము సులభముగా గ్రహింపవచ్చును. కృష్ణుని సేవించుట ఎట్లో, భౌతిక సేవల నుండి తప్పించుకొనుట ఎట్లో, కృష్ణ చైతన్యమును పొందుట యెట్లో, తరువాత లౌకికాహంకారముల నుండి బైటపడుట ఎట్లో అంతయు భగవద్గీతలో కృష్ణుడు అర్జునునికి శాస్త్రముగ ఉపదేశించెను.

పైన పేర్కొన్న 'పరిత్రాణాయ సాధూనాం' అను శ్లోకము నందలి 'సాధు' పదమునకు పవిత్ర చరిత్రగల సత్పురుషుడని అర్థము. సత్పురుషుడు క్షమాగుణము గలవాడై అందరి యెడల దయగలిగి యుండి సర్వభూతముల యెడ స్నేహభావన కలిగియుండును. ఎవ్వరికిని శత్రువుకాడు. సదా శాంతుడై యుండును. పుణ్యపురుషునిలో ఇరువది యారు సద్గుణములున్నవి. భగవద్గీతలో శ్రీకృష్ణుడు స్వయముగా నిట్లు ఉద్ఘోషించెను :



అపి చేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవ స మన్తవ్యః సమ్యగ్వ్యవసితో హి సః

"మిక్కిలి అసహ్యమైన పనులు చేయువాడు కూడ ప్రేమయుక్త సేవలో నిమగ్నుడై ఉన్నచో అతడు నిశ్చయములో తగినట్లుగా ప్రతిష్ఠితుడై యుండుటచే సజ్జనుడుగనే (యోగిగనే) పరిగణింపబడవలెను." (భ. గీ. 9.30).

భౌతికధరాతలమున ఒకరికి నీతియైనది మరి యొకరికి అవినీతి కావచ్చును. హిందువుల దృష్టిలో మద్యపానము నిషిద్ధము. కాని, పాశ్చాత్యప్రపంచములో అది సర్వసామాన్యము. కాబట్టి నీతి అనునది దేశకాల సాంఘిక పరిస్థితులు మొదలైన వానిని బట్టి యుండును. కాని, ప్రతి మానవ సంఘమునందును నిత్యవినీతి విచక్షణ జ్ఞానమున్నది. ఈ శ్లోకములో ఒకవేళ ఎవడైనను దురాచారపరుడైయున్నను అతడు కృష్ణ చైతన్యములో మునిగియున్నచో, పవిత్రుడుగా పరిగణింపబడవలెనని కృష్ణుడు ప్రత్యేకముగా చెప్పుచున్నాడు. అనగా ఒక మానవుడు పూర్వ సంబంధమువలన దురాచార పరుడైనను, కృష్ణచైతన్యములో పూర్తిగా నిమగ్నుడయినచో ఆ దురాచారములను లెక్కలోకి తీసికొనరాదు. ఏది ఎట్లైనను ఎవడైనను కృష్ణచైతన్యము గలవాడైనచో, అతడు క్రమక్రమముగా పవిత్రుడై సాధువు కాగలడు. కృష్ణచైతన్యమును ఆచరణలో పెట్టుకొలది అతని దురాచారములు నన్నగిలి సంపూర్ణ సాధువు కాగలడు.

ఈ సందర్భములో ఒక దొంగను గురించి ఒక కథ ఉన్నది. అతడు ఒక పుణ్యక్షేత్రమునకు యాత్రవెళ్ళెను. త్రోవలో అతడును, తోడి యాత్రికులును విశ్రమించుటకు ఒకరాత్రి యంతయును ఒక సత్రమున ఆగిరి. దొంగతనమునకు అలవాటుపడిన అతడు ఇతర యాత్రికుల వస్తువులను దొంగిలించుటకు ఉపాయ మాలోచించుచుండెను.

కాని "నేను పుణ్యక్షేత్రయాత్రకు బయలుదేరినవాడను గదా. కాబట్టి వీరి వస్తువులను దొంగిలించుట మంచిదికాదు. కూడదు. ఈ పనిచేయును." అని అనుకొనెను. కాని అలవాటు ప్రకారము ఆ సామానునుండి చేతులు తీసివేయలేక ఒక యాత్రికుని మూట తీసికొని మరియొక్క చోట దాచెను. ఆ విధముగ మూటల స్థలములను మార్చుచు రాత్రి యంతయు గడపెను. కాని, అంతరాత్మ వద్దనుట వలన ఆ మూటల నుండి ఏమియును తీసికొనలేదు. మరునటి ఉదయమున యాత్రికులు మేలుకొని తమ వస్తువుల కొఱకు అన్ని వైపులను చూచిరిగాని అవి కనబడలేదు. పెద్ద కలవరమయి, చివరకు వారు తమ మూటలు ఇతరస్థలములలో ఉండుట చూచిరి. అప్పుడు ఆ దొంగ ఇట్లనెను. "అయ్యలారా, దొంగతనము నావృత్తి. కావున రాత్రి సమయమున దొంగతనము చేయుట నా అలవాటు. మీ మూటలనుండి ఏమైనను దొంగిలింపవలె ననుకొంటిని. కాని నేను పుణ్యక్షేత్ర దర్శనమునకు వచ్చినవాడను గాన దొంగిలించుట సాధ్యము కాకపోయెను. కాబట్టి మూటలను స్థలాంతరమునకు మార్చుట మాత్రము జరిగినది. దయచేసి నన్ను క్షమింపుడు" దురభ్యాస లక్షణము ఆ విధముగ నుండును. అటుతర్వాత అత డెన్నడును దొంగతనము చేయదలచుకొనలేదు. కాని, అలవాటు ప్రకారము అప్పుడప్పుడు చేయుచుండెను. కాబట్టి దురాచారములనుండి విరమించుకొని కృష్ణ చైతన్యమున ముందుకు పోవును. అప్పుడప్పుడు తలవని తలంపుగా ఆ దురాచారమునకు లోబడి పోయినను, అతనిని మనము సాధువుగా పరిగణింపవలెనని కృష్ణు డనుచున్నాడు.

తర్వాతి శ్లోకమున కృష్ణు డేమనునో చూడుడు :

*క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి*
*కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి*



"ఓ కౌంతేయా ! అతడు వెంటనే ధర్మాత్ముడై శాశ్వతమైన శాంతిని పొందును. నా భక్తుడెప్పుడును నశింపడని ధైర్యముగా ఘోషింపుము." (భ. గీ. 9 31).

కృష్ణచైతన్యమునకు అంకితుడయినవాడు త్వరలోనే సాధువై పోవునని శ్రీకృష్ణుడు ఘోషించెను. ఎలెక్ట్రిక్ ఫ్యాను యొక్క ప్లగ్గును ఊడబెరికినను, ఫ్యాను మరికొంతసేపు తిరిగి అగిపోవునని అందరికిని తెలియును. అట్లే కృష్ణపాదపద్మములను ఆశ్రయించిన తర్వాత, కర్మ పరంపరలను నడపు ప్లగ్గును ఊడబెరికి వేయుదుము. తర్వాత గూడ ఈ కర్మలు కొంతకాలము కొనసాగినను, త్వరలో అవి సమసిపోవునని గ్రహింపవలెను. నిజమునకు, కృష్ణచైతన్యమును ఆశ్రయించినవాడు సాధుపురుషు డగుటకు వేరు ప్రయత్నము చేయనవసరము లేదు. సద్గుణము లన్నియు స్వయముగనే వచ్చి అతనిని చేరును. కృష్ణచైతన్యమును సంపాదించిన సమకాలములోనే సర్వసద్గుణములు పొందునని శ్రీమద్భాగవతములో కృష్ణుడనును. అట్లుగాక, భగవద్భావన లేకుండ ఎన్ని సద్గుణములున్నను, అవి అన్నియును నిరుపయోగములుగా భావింప వలెను. ఎందువల్ల ననగా, అవాంఛనీయ కర్మాచరణమునుండి ఏదియును అతనిని నివారింపదు. కృష్ణచైతన్యము లేనివాడు ఈ భౌతిక ప్రపంచమున అనర్థము చేయుట తప్పదు.

*జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః*
*త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున*

"ఓ అర్జునా ! నా యొక్క పుట్టుక నాలీలలు దివ్యములైనవని యెరింగిన వాడే శరీరము వదలిన పిదప (మరణానంతరము) ఈ భౌతికలోకమున జనింపక నా సన్నిధికే చేరును." (భ. గీ. 4.9)

ఇక్కడ కృష్ణుని అవతారప్రయోజనమును గురించి మరి కొంత వివరింపబడినది. ఒక ప్రయోజనముకొరకు అవతరించినపుడు కొన్ని

పనులు చేయవలసి ఉండును. కొంతమంది తత్త్వచింతకులు దేవుడు అవతారములను ఎత్తనే ఎత్తడందురు. "ఈ దుష్ట ప్రపంచములోనికి దేవుడు ఎందుకు రావలెను?" అని వారందురు. కాని భగవద్గీతలో అట్లు చెప్పబడినదంతయును ప్రమాణమే అనియు మరచిపోరాదు. అట్లు కానిచో దానిని చదువవలసిన అవసరములేదు. గీతలో తా నొక ప్రయోజనము కొరకు జన్మించినట్లును, దానితోపాటు కొన్ని కర్మలు చేసినట్లును కృష్ణుడు చెప్పెను. కృష్ణుడు అర్జునుని సారథిగా ఉండి కురుక్షేత్ర సంగ్రామములో అనేక కర్మలు చేసిన సంగతి మనకు తెలియును. యుద్ధము సంభవించినపుడు ఒక వ్యక్తిగాని, జాతిగాని మరియొక వ్యక్తి పక్షమునగాని, జాతిపక్షమునగాని చేరవచ్చును. శ్రీకృష్ణుడు రణరంగములో కొంత పక్షపాతము చూపించి అర్జున పక్షమున చేరెను. కాని, పైకి మాత్రమే అతడు పక్షపాతము గలవానివలె కనబడును. ఆ పక్షపాతమును సాధారణ పక్షపాతమని అనుకొనరాదు.

ఈ భౌతిక ప్రపంచములో తాను కనబడుట యనునది దివ్య విషయమని ఈ శ్లోకములో కృష్ణుడు చూపించుచున్నాడు. దివ్యం అను పదమునకు అలౌకికము, సర్వాతిరిక్తము అని అర్థము. ఆయనకర్మలు ఏ విధముగనైనను సామాన్యములుగావు. నేటికిని భారతదేశములో శ్రావణ మాసమున క్రిష్టమసులో క్రీస్తు జన్మదినమును క్రైస్తవులు పండుగ చేసికొనునట్లు జనులు కులభేదము లేకుండ కృష్ణజన్మోత్సవము చేసికొనుచున్నారు. శ్రీకృష్ణజన్మదినమును "జన్మాష్టమి" అందురు. ఈ శ్లోకములో నా జన్మ అని చెప్పుటలో "జన్మ" పదమును ప్రయోగించెను. జన్మ కర్మ లున్నవి కాబట్టి కృష్ణ జన్మకర్మలు దివ్యములు. అనగా, అవి సామాన్య జన్మ కర్మలు కావని అర్థము. అవి ఎట్లు దివ్యములు? అని ఎవరైనను అడుగ వచ్చును. ఆయన జన్మించినాడు. అర్జునునివైపు యుద్ధములో పాల్గొనినాడు. అతనికి దేవకీవసుదేవు లను పేరుగల తల్లి



దండ్రులున్నారు. ఒక కుటుంబ మున్నది. వీనిలో ఏది దివ్యమనుకొనవలెను? "*ఏవం యో వేత్తి తత్త్వతః*" అని కృష్ణుడనెను. అతని జన్మకర్మల తత్త్వమును తెలిసికొనవలెను. దాని ఫలితము "*త్యక్త్వాదేహం పునర్జన్మనైతి మామేతి సోఽర్జున*" అనగా ఈ దేహమును విడిచిన తర్వాత అతడు మరల జన్మింపక కృష్ణునే చేరును. అనగా మోక్షము పొందునని అర్థము. శాశ్వతమైన ఆత్మలోకము చేరి ఆనందభరితమైన తనస్వరూపస్థితిని పొందును. ఇదంతయును కృష్ణుని దివ్య జన్మకర్మలను తెలిసికొనుట వలన ప్రాప్తించును.

సాధారణముగా ఒక దేహమును విడిచినవాడు దేహాంతరము గ్రహించును. జీవులు దేహములను మార్చుచుండుట వలననే జీవుల జన్మలు సాగుచున్నవి. పునర్జన్మప్రాప్తి జీవుల కర్మలనుబట్టి సంభవించును. ఎప్పటికప్పుడు ఈ భౌతిక (ప్రత్యక్ష స్థూల) దేహమే మన నిజమైన దేహ మనుకొనుచున్నాము. కాని అది ఒక దుస్తువంటిది. యథార్థముగా మనకు శరీర మనునది ఉన్నది. అది ఆధ్యాత్మిక శరీరము. దానితో పోల్చిచూచినచో ఈ ప్రత్యక్ష స్థూలశరీరము తాత్కాలికము. ఈ స్థూలశరీరము ముసలిదై పనికిరానప్పుడు లేదా ఆకస్మిక ప్రమాదము వలన చెడిపోయినప్పుడు, దానిని చిరిగి, మాసిపోయిన వస్త్రమువలె విడిచి వేసి మరియొక స్థూలశరీరమును తీసికొందుము.

*వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి*
*తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ*

"మానవుడు తన చినిగిపోయిన వస్త్రములను వదలి నూతన వస్త్రములను ధరించినట్లే ఆత్మయు నిష్ప్రయోజనమైన ఈ శరీరమును వదలి క్రొత్త శరీరములోనికి పోవును." (భ. గీ. 2.22)

మొదట శరీరము ఒక సెనగగింజ యంత యుండును. తర్వాత

శిశువుగా పెరుగును. తర్వాత బాలుడుగా, యువకుడుగా, ముసలివాడుగా మారి, చివరకు అది పనికిరానప్పుడు క్రొత్తదేహమునకు మారును. కాబట్టి శరీరము సదా మారి పోవుచునే యున్నది. మరణమనునది ఈ దేహము మార్పులలో చివరిది.

*దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా,*
*తథా దేహాన్తరప్రాప్తిర్ధీర స్తత్ర న ముహ్యతి*

"ఈ శరీరము నందలి ఆత్మ బాల్యమునుండి యౌవనమునకు యౌవనము నుండి ముసలి తనమునకు ఎట్లవిచ్ఛిన్నముగ పోవుచుండునో అట్లే ప్రాణి మరణించు సమయమున వేరొక శరీరములోనికి పోవును. ఆత్మజ్ఞానము గల మానవు డిట్టి మార్పునకు విషాదము చెందడు." (భ. గీ. 2.13)

దేహము మారుచున్నను, లోపలనున్న దేహి మారకుండ అట్లే ఉండును. బాలుడు యువకుడుగ మారినను, లోపల నున్న జీవాత్మ మారలేదు. అంటే బాల్యములో నున్న జీవాత్మ మారలేదు. అంటే బాల్యములో నున్న జీవాత్మ లేచిపోయెనని అర్థముకాదు. శరీరము ప్రతిక్షణము మారిపోవుచున్నదని వైద్యశాస్త్రము చెప్పుచున్నది. ఈ మార్పులకు ప్రాణులు ఎట్లు భయపడరో, అట్లే ఆత్మజ్ఞానము కలవాడు మరణ సమయమున ఈ దేహము చెందు చివరి మార్పునకు భయపడడు. కాని, వస్తువులను ఉన్నవి ఉన్నట్లుగా అర్థము చేసికొననివాడు శోకించును. భౌతిక స్థితిలో మనము మన శరీరములను ఎల్లప్పుడును మార్చుచునే యున్నాము. అదే మనకు వ్యాధి. కాని, మన శరీరమును ఎల్లప్పుడును మానవశరీరముగానే మార్చుచున్నామని కాదు. ఒక పశు శరీరముగను మారవచ్చును. లేక దేవతల శరీరమును గ్రహింపవచ్చును. అది మన కర్మలను బట్టి యుండును. పద్మపురాణము ప్రకారము జీవరాసులు 84 లక్షలున్నవి. మనకు వానిలో ఏజన్మ అయినను రావచ్చును. కాని, తన



దివ్య జన్మ కర్మల తత్త్వము నెరిగినవాడు జన్మసంసార చక్రబంధము నుండి విముక్తుడగునని కృష్ణుడు ప్రతిజ్ఞ చేసినాడు.

కృష్ణుని దివ్య జన్మ కర్మలను తత్త్వతః తెలిసికొనుట యెట్లు? ఇది భగవద్గీతలోని 18 వ అధ్యాయములో వివరింప బడినది.

*భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః*
*తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్*

"మానవుడు భక్తి యుక్తసేవచే దేవాదిదేవుడైన నన్ను యథాతథముగ అర్థము చేసికొనగలడు ; అట్టి భక్తిచే అతడు నన్ను పూర్తిగా నెరింగినప్పుడు భగవద్రాజ్యమును ప్రవేశింపగలడు." (భ. గీ. 18.55)

మరల ఇక్కడ కూడ 'తత్త్వతః' 'నిజమైన' అని ప్రయోగింపబడినది. భక్తుడైన తర్వాతనే ఎవనికైనను కృష్ణ విజ్ఞానము ప్రాప్తించగలదు. భక్తుడు కాని వాడు, కృష్ణచైతన్యము కొరకు ప్రయత్నింపనివాడు తెలిసికొనజాలడు. చతుర్థాధ్యాయ ప్రారంభములో కూడ అర్జునుడు తన భక్తుడనియు, సఖుడనియు, అతనికి ప్రాచీన యోగశాస్త్రమును బోధించుచున్నట్లు శ్రీకృష్ణుడనెను. (భ. గీ. 4 3) ఎందుకనగా, కేవలము విజ్ఞాన వినోదము కొరకు భగవద్గీతను చదువువానికి కృష్ణ తత్త్వము రహస్యముగానే ఉండిపోవును. భగవద్గీత దబ్బిచ్చి దుకాణము నుండి కొని, కేవల పాండిత్యముతో అర్థము చేసికొన దగిన పుస్తకము కాదు. అర్జునుడు పెద్ద పండితుడును కాడు; వేదాంతియును కాడు; తత్త్వచింతకుడును కాడు ; బ్రాహ్మణుడును కాడు ; సన్యాసియును కాడు. అతడు మహాయోధుడైన గృహస్థు. అయినను కృష్ణుడు అర్జునుని తనశిష్యపరంపరలో ప్రథమునిగా, గీతోపదేశ శ్రవణమునకు అర్హునిగా ఎన్నుకొనెను. ఏల ? ఏలనన, "నీవు నాభక్తుడవు కాబట్టి" అనెను. భగవద్గీతను నిజముగా అర్థము చేసికొనవలెనన్న అట్టి యోగ్యత ఉండవలెను. అనగా కృష్ణచైతన్యము గలవాడై ఉండవలెను.

ఇక, కృష్ణచైతన్యమన నేమి? అది "హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే, హరేరామ హరేరామ రామరామ హరేహరే" అని జపించుట ద్వారా మనస్సు అను అద్దమునుండి దుమ్మును తుడిచివేయుకార్యక్రమము. ఈ మంత్రము జపించుట చేతను, భగవద్గీతను శ్రవణము చేయుట చేతను మనము క్రమముగా కృష్ణచైతన్యమును పొందగలము. "*ఈశ్వర స్సర్వభూతానామ్*"- కృష్ణుడు నిరంతరము మన హృదయము లోపలనే విరాజిల్లుచున్నాడు. జీవాత్మయును, పరమాత్మయును ఈ శరీరమను వృక్షముపై కూర్చుని యున్నారు. జీవుడు ఆ వృక్షము యొక్క ఫలములను తినుచుండును. పరమాత్మ ఊరక చూచుచుండును. సాక్షిగా నుండును. జీవాత్మ భక్తి యుక్త సేవాక్రమము మొదలుపెట్టి క్రమేణ కృష్ణచైతన్యమును వృద్ధిచేసికొనుట ప్రారంభించగనే అంతఃకరణములోపల నున్న పరమాత్మ మనోదర్పణము నుండి మాలిన్యమును కడిగివేసికొనుటకు సాహాయ్యము చేయును. సర్వసాధువులకును కృష్ణుడు స్నేహితుడు. కృష్ణచైతన్య వంతుడగుటకు పూనుకొనుట సాధుసమ్మతమగు ప్రయత్నము. *శ్రవణం, కీర్తనం*-గానము చేయుట, వినుటచేత కృష్ణ విజ్ఞానమును గ్రహించి, తద్ద్వారా కృష్ణుని తెలిసి కొనగలుగుట సంభవించును. అట్లు తెలిసికొన్న తర్వాత మరణకాలమున వెంటనే ఆధ్యాత్మికప్రపంచమున దేవదేవుని నివాసము చేరును. ఈ ఆధ్యాత్మిక ప్రపంచము భగవద్గీతలో ఇట్లు వర్ణింపబడినది:

*న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః*
*యద్గత్వా ననివర్తన్తే తద్ధామ పరమం మమ*

"ఆ నా దివ్యధామము సూర్యునిచే గాని, చంద్రునిచే గాని, అగ్నిచేగాని విద్యుత్తుచే గాని ప్రకాశింపజేయబడదు. దానిని చేరువారు మరల నీ భౌతిక ప్రపంచమున కెప్పుడును తిరిగి రారు." (భ. గీ. 15.6)



ఈ భౌతిక ప్రపంచము సర్వదా చీకటి కాబట్టి దానికి వెలుతురిచ్చుటకు సూర్యచంద్రాగ్నులు కావలెను. ఈ చీకటిలో ఉండవద్దనియు, జ్యోతిలోనికి, ఆత్మలోకమునకు రావలెననియు వేదములు మనలను శాసించుచున్నవి. 'చీకటి' యను పదమునకు రెండర్థము లున్నవి. వెలుతురు లేకపోవుట అనియే గాక అజ్ఞానమనియు అర్థము.

దేవదేవుని శక్తులు అనంతములు. దేవదేవు డీ ప్రపంచమునకు దిగి వచ్చుట కర్మలు చేయుటకొరకే అని కాదు. దేవదేవునికి కర్తవ్యమే లేదని వేదములు చెప్పుచున్నవి. భగవద్గీతలో కృష్ణుడు కూడ ఇట్లు చెప్పెను :

*న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కిఞ్చన*
*నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి*

"ఓ కుంతీపుత్రా! నాకీ ముల్లోకముల యందును నియమితమైన కర్తవ్యము లేనేలేదు. నాకేమియు నక్కరయే లేదు. నేను కోరవలసినదేదియును లేదు. అయినను నేనెల్లప్పుడు కర్మ నిమగ్నుడనై యుందును." (భ. గీ. 3.22)

కాబట్టి ఈ భౌతిక ప్రపంచములోనికి దిగివచ్చి ఈ కర్మలన్నియు చేయవలసిన అవసరము కృష్ణునికి ఉన్నదని మనము తలంపరాదు. కృష్ణునికి సమానుడు గాని, అధికుడు కాని ఎవడును లేడు. ఆయన నిత్యసర్వజ్ఞుడు. జ్ఞానము కొరకు తపస్సులు చేయుటకు గాని, జ్ఞానమును సంపాదించుటకు, పొందుటకు గాని ఆయనకు అవసరమెప్పుడును లేదు. సర్వకాల సర్వావస్థల యందును ఆయన జ్ఞానపూర్ణుడే. అర్జునునికి ఆయన భగవద్గీత నుపదేశించి యుండవచ్చు; కాని తనకు ఎప్పుడును, ఎవరును భగవద్గీత ఉపదేశించియుండలేదు. ఇది కృష్ణస్వరూపము అని తెలిసినవాడు భౌతికలోకమున సంసారచక్రములో మరల పడిపో

నక్కరలేదు. మాయాప్రభావమునకు లోనై ఈ భౌతిక వాతావరణమునకు అనుకూలముగ సర్దుబాట్లు చేసికొనుటలో మన జీవిత కాలములను గడుపుచున్నాము, కాని మానవ జీవితముయొక్క ప్రయోజన మిది కాదు. శ్రీకృష్ణుని తత్త్వమును గ్రహించుటయే మానవ జీవిత ప్రయోజనము.

మన భౌతిక జీవితావసరము లివి : ఆహార సమస్య, మైథున సమస్య, నిద్ర, ఆత్మరక్షణ, ఇంద్రియ విషయవాంఛలను తీర్చుకొనుట ఇవి పశువులకు, మనుష్యులకు సమానమే. ఈ సమస్యలను పరిష్కరించుకొనుటలోనే పశువులు నిమగ్నమై యుండును. మరి మనము కూడ ఆ సమస్యల పరిష్కార ప్రయత్నములోనే యున్నచో మృగములకును, మనకును భేదమేమున్నది ? మానవునికి ఒక విశిష్టగుణ మున్నది. దానితో దివ్యమగు కృష్ణచైతన్యమును సంపాదింపగలడు. కాని, అతడు దానిని సరిగా వినియోగించుకొనకపోతే పశుకోటిలోని వాడగును. ఆధునిక నాగరికతలోని దోషమేమన, ఈ జీవన నిర్వహణ సమస్యాపరిష్కారమునకే అత్యధికప్రాధాన్యము నిచ్చుట. ఆస్తిక బుద్ధి గలిగిన జీవులము కాబట్టి ఈ జనన మరణ సంసార చక్రమునుండి బైట పడుట మన కర్తవ్యము. కాబట్టి మనుష్య జన్మలోని ప్రత్యేకావకాశములను పోగొట్టుకొనకుండ మనము జాగ్రత్త పడవలెను. శ్రీకృష్ణుడే స్వయముగా భగవద్గీతను ఉపదేశించుటకు వచ్చి మనము భగవ చ్చైతన్యముపొందుటకు సహాయముచేయును. నిజమునకు ఈ భౌతిక సృష్టి— శరీరము జ్ఞానాభివృద్ధి ప్రయత్నముల కుపయోగించుటకు ఇవ్వబడినది కాని, ఇట్టి అవకాశమును, ఈ మానవ జన్మ యను వరమును పొంది, వానిని కృష్ణచైతన్యాభివృద్ధికి ఉపయోగించుకొననిచో మనము అపూర్వ దుర్లభావకాశమును జారవిడుచుకొనుచున్నాము. ఈ కృష్ణచైతన్యప్రాప్తి ప్రక్రియ చాల సులభమైనది. శ్రవణం, కీర్తనం– వినుట, పాడుట వినుట కంటె వేరుగ మనమేమియు చేయనవసరము లేదు. జాగ్రత్తగా శ్రవణము చేసినచో ఆత్మ జ్ఞానోదయము తప్పక కలుగును. కృష్ణుడు హృదయములోనే ఉన్నాడు కాబట్టి తప్పక సాహాయ్యము చేయును. మనము స్వల్పకాలము వినియోగించి, కొంచెము శ్రమ తీసికొనిన చాలును. ఇందులో అభివృద్ధి నేమైనను సాధించితిమా యని ఎవరును మనలను అడుగ నవసరములేదు. ఆకలిగొన్నవానికి సంపూర్ణ భోజనము తృప్తి నిచ్చినదో లేదో స్వయముగానే తెలిసినట్లు మనకే స్వయముగా తెలియగలదు.



వాస్తవముగ ఈ కృష్ణచైతన్యప్రాప్తి ప్రక్రియ లేక ఆత్మ సాక్షాత్కారము ఎక్కువ కష్టముకాదు. దానిని కృష్ణుడు భగవద్గీతలో అర్జునునికి బోధించినాడు. మనముకూడ అర్జునుని వలె భగవద్గీతను అర్థము చేసికొన్నచో పరిపూర్ణ స్థితిని జేరుట ఒక సమస్య కానేరదు. కాని భగవద్గీతను మనము మన లౌకిక విద్వత్తా పూర్ణ మనస్తత్త్వముతో వ్యాఖ్యానించినచో దానిని పూర్తిగా చెడగొట్టినవార మగుదుము.

ఇంతకు ముందు చెప్పినట్లు జపము నభ్యసించుట చేత అద్దమువంటి మనస్సునకు భౌతిక ప్రపంచసంపర్కము వలన అంటిన కాలుష్యము లన్నింటిని తొలగింపవచ్చును. కృష్ణచైతన్య పునఃప్రాప్తికై బాహ్య సహాయము అనవసరము. ఏలయన, కృష్ణ చైతన్యము ఆత్మలోనే గుప్తముగా నున్నది. నిజము చెప్పవలెనన్న, అది ఆత్మకు నిజలక్షణము. ఈ అభ్యాసములో దానిని జాగృత మొనర్చుచున్నాము. కృష్ణ చైతన్యము నిత్య సత్యము. అది యేదియో సంస్థచే శాసింపబడిన సిద్ధాంతము గాని, నమ్మకముల మూటగాని కాదు. అది జీవులందరిలోను ఉన్నది – మనుష్యులైనను, పశువులైనను సరే. చైతన్య మహాప్రభువు దక్షిణ భారతారణ్యములలో సుమారు ఐదు వందల సంవత్సరముల క్రితము ప్రయాణము చేసినపుడు, హరే కృష్ణగానము చేయగా, పులులు ఏనుగులు, లేళ్ళు ఆయనతో బాటు సంకీర్తన నర్తనములు చేసినవి. అది సంకీర్తనముయొక్క స్వచ్ఛతనుబట్టి యుండును గదా! సంకీర్తనములో ముందుకు సాగిన కొలది నిర్మలత్వము తప్పక వచ్చును.

# 3. సర్వదా సర్వత్ర కృష్ణ సాక్షాత్కారము

మన వ్యావహారిక జీవితములో కృష్ణచైతన్యము నెట్లు జాగృత మొనర్పవలెనో కృష్ణు డుపదేశించెను. అది మన విధి నిర్వహణములను మానుట వల్లగాని, కర్మలను విరమించుటవలన గాని కాదు. మరి ఏమన; అన్ని పనులను కృష్ణచైతన్యములో నిర్వహింపవలెను. ప్రతివానికిని జీవితమున ఏదియో వృత్తి యుండును. కాని, ఏ భావనతో దానిలో ప్రవేశించుచున్నాడు ?– అనునదియే ప్రశ్న. ప్రతివాడును "అహా! నా కుటుంబమును పోషించుటకు నాకేదో వృత్తి కావలెను గదా," అని యనుకొనును. సంఘమును గాని, ప్రభుత్వమును గాని, కుటుంబమును గాని తృప్తిపరచవలెను. అట్టి భావననుండి విముక్తుడైనవా డెవడును లేడు. ఏ పనియైనను చక్కగా నిర్వహింపవలెనన్న చేయువానికి సరియైన భావన యుండవలెను. ఎవని బుద్ధి క్షోభించుచు నుండునో, అతడు పిచ్చివానివలె ఏమియును సరిగా చేయలేడు. మనవిధి మనము సరిగా నిర్వహింపవలెను ; గాని కృష్ణుని తృప్తిపరచు నుద్దేశముతో చేయవలెను. మన కార్యము మార్చుకొనవలెనని కాదు. మరి, మనము ఎవరి కొరకై పని చేయుచున్నామో అర్థము చేసికొనవలెను. మనము చేయవలసినది చేయవలెను గాని, 'కామము' నకు లోబడగూడదు. కామ మనగా కోరిక. కామమను సంస్కృతపదమును స్త్రీ సంభోగవాంఛను, విషయవాంఛను తెలుపుటకు ఉపయోగింతురు. కామతృప్తి కొరకు, విషయసుఖము కొరకు మనము పనిచేయరాదని కృష్ణు డాదేశించెను.



భగవద్గీతోపదేశమంతయు ఈ సిద్ధాంతము మీదనే ఆధారపడియున్నది.

అర్జునుడు తన బంధువులతో యుద్ధము మానుట ద్వారా తన యింద్రియములను సంతోషపెట్టదలచెను. కాని, దేవదేవుని అనుగ్రహము కొరకు తన కర్తవ్యమును నిర్వహింపవలెనని అతనికి నచ్చచెప్పుటకు కృష్ణుడు ప్రయత్నించెను. తన బంధువర్గమును చంపుటకు నిరాకరించుట, రాజ్యముపై హక్కును వదులుకొనుట లౌకిక దృష్టిలో గొప్పధర్మబుద్ధిగా కనబడవచ్చును గాని, తన కోరికల తృప్తిపరచుట యను సిద్ధాంతము అర్జునుని యొక్క యుద్ధవిరమణకు కారణము గాన, కృష్ణుడు దానిని ఆమోదించ లేదు. ఎవరైనను తన పనిని గాని, వృత్తిని గాని మానుకొనవసరములేదు – అర్జునుని విషయమున మారలేదు. కాని తన చైతన్యమును మాత్రము మార్చవలసి యుండును. చైతన్యము మారుటకు జ్ఞాన మవసరము. "నేను కృష్ణునిలో అంశభూతుడను. కృష్ణుని పరాశక్తిని" అని తెలిసికొనుటయే ఆ జ్ఞానము. అది నిజమైన జ్ఞానము, సాపేక్షజ్ఞానమైనచో ఒక యంత్రమును బాగు చేయుట యెట్లో నేర్పును. కాని, నిజమైన జ్ఞానమనగా, మనస్థానము కృష్ణునిలో అంశభూతమైయున్నదని తెలియుట. మనము అతని అంశలము గనుక మన సుఖము గూడ అసంపూర్ణమై సంపూర్ణ సుఖముపై ఆధారపడి యుండును. ఉదాహరణమునకు :– నాచేయి నాదేహభాగముగా నున్నప్పుడు దానికి సేవచేసి సుఖ మనుభవించగలదు. ఇతరుల దేహమును సేవించుటలో దానికి ఆనందము లేదు. మనము కృష్ణునిలో భాగము కాబట్టి ఆయనను సేవించుటలో సుఖము కలుగును. "నిన్ను సేవించుటలో నాకు సుఖములేదు. నన్ను నేను సేవించుటలో నాకు సుఖమున్నది." అని ప్రతివాడును అనుకొనును గాని, ఆ "నేను" అనున దేమిటో, ఎవరో ఎవరికిని తెలియదు. ఆ నేను కృష్ణుడు.

మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః
మనః షష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి

"ఈ బద్ధ ప్రపంచము నందలి జీవులందరును నా శాశ్వతాంశములు. బద్ధ జీవిత కారణమున వారు మనస్సుతోకూడిన అరు ఇంద్రియముల నాకర్షించి తీవ్రసంఘర్షము సలుపుచున్నారు." (భ. గీ. 15.7)

ఇపుడు భౌతిక సంపర్కము వలన జీవులు పూర్ణాత్మ నుండి విడిపోయి యున్నారు. కాబట్టి మనలోనే దాగియున్న కృష్ణచైతన్యముద్వారా మరల కలసిపోవుటకు గట్టి ప్రయత్నము చేయుట అవసరము. కృష్ణుని మరచి స్వతంత్రముగా జీవించుటకు ప్రయత్నించు చున్నాము. కాని, అది కృత్రిమము, ప్రకృతి విరుద్ధము గాన అసంభవము. కృష్ణునితో సంబంధము లేకుండ జీవించుటకు ప్రయత్నించినపుడు, మనము భౌతిక ప్రకృతి నియమముల ప్రభావమునకు లోనగుదుము. తాను కృష్ణుని స్వాధీనములో లేడనుకొన్నవాడు కృష్ణుని మాయాశక్తికి స్వాధీనమగును. ఎట్లన? ప్రభుత్వమునకును, దాని చట్టములకును లొంగనివాడు పోలీసధికారులకు లొంగిపోవలసి వచ్చును. ప్రతివాడును స్వతంత్రుడగుటకు ప్రయత్నించుచున్నాడు. అదే మాయ. వ్యక్తిగా కులముగా, సాంఘికముగా జాతీయముగా, అంతర్జాతీయముగా, ఏవిధముగానైనను స్వాతంత్ర్యము అసంభవము. మనము స్వతంత్రులము కాము అని గ్రహించినపుడు మనకు జ్ఞానము వచ్చినదన్నమాట. నేడు పెక్కుమంది ప్రపంచ శాంతి కొరకు పాటుపడుచున్నారు. కాని, ఆ శాంతిపథకము నెట్లు అమలుపరచవలెనో ఎరుగరు. ఐక్యరాజ్యసమితి ఇప్పటికి యెన్నో యేండ్లుగా శాంతి కొరకు పెనగులాడుచున్నది. కాని, యుద్ధము సాగుచునే యున్నది.

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున
న తదస్తి వినా యత్ స్యాన్మయా భూతం చరాచరమ్



"మరియు ఓ అర్జునా! అన్ని జీవితములను పుట్టించు బీజమును నేనే, జంగమస్థావరములయిన వస్తువులలో నేను లేకుండ ఉండగలది లేదు." (భ. గీ. 10.39)

కాబట్టి కృష్ణుడు సర్వభూతములకు స్వామి, సర్వకర్మఫలభోక్త. మన కర్మఫలములు మనవి అని మన మనుకొనవచ్చును. కాని, అది భ్రమ. మన కర్మఫలముల కన్నిటికిని కృష్ణుడే ఏకైక స్వామియని మనము తెలిసికొనవలెను. ఒక కార్యాలయములో వందలకొలది మనుష్యులు పనిచేయుచుండ వచ్చును గాని, దాని వలన వచ్చు లాభమంతయు యజమానికి చెందునని ప్రతి జీతగానికిని తెలియును. ఒక బ్యాంకులో టెల్లర్ అను ఉద్యోగి "ఆహా! ఈ ధనమంతయు నాది. దీనిని ఇంటికి తీసికొని పోయెదను గాక!" అని భావించినచో, ఇక అతని కష్టములు ప్రారంభమగును. మనము కూడబెట్టిన ధనము నంతయును మన విషయవాంఛలకే ఖర్చుపెట్టుకొనవచ్చునని మనము భావించినచో? విషయోపభోగవాంఛతో కర్మలు చేయుచున్నామని అర్థము. కాని, మనది యనునది ప్రతిదియును కృష్ణునిదని తెలిసికొన్నచో, విముక్తుల మగుదుము. అదే ధనము మనచేతిలో నుండవచ్చును గాని, అది మనది అనుకొన్నచో మనము మాయలో పడినట్లే. ఈ సర్వమును కృష్ణునికి చెందినది అను జ్ఞానములో స్థిరపడినవాడే నిజమైన పండితుడు.

ఈశావాస్య మిదం సర్వం యత్కిఞ్చ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుఞ్జీథా మా గృధః కస్య స్విద్ ధనమ్

"ఈ విశ్వములోని చేతనాచేతన పదార్థములన్నియు భగవంతుని సొంతములై ఆయన అజ్ఞకు లోబడి యున్నవి. కాబట్టి ఎవడైనను తనకెంత అవసరమో, తన వంతునకు ఎంత ప్రత్యేకించబడినదో, అంత మాత్రమునే స్వీకరింపవలెను. అది తన సొమ్ము కాదని తెలియును కాబట్టి ఇతరములను స్వీకరింపగూడదు." ఈశోపనిషద్, మంత్ర.1)

ఈ ఈశావాస్యజ్ఞానము – అనగా, సర్వము కృష్ణుని ధనము అను జ్ఞానము వ్యక్తిగతము గానే కాక, జాతిలోను, సర్వప్రపంచము లోను కూడ పునరుద్ధరింపబడవలెను. అప్పుడు శాంతి ఏర్పడును. మనము తరచుగా పరహితాభిలాషతో నిఃస్వార్థముగా ఉండవలెనని కోరుకొనుచు స్వదేశీయుల తోడను, కుటుంబ సభ్యులతోడను, ప్రపంచములోని అన్ని జాతుల వారితోడను స్నేహముగా నుండవలెనని యత్నించుదుము. కాని, ఇది మిథ్యాభావనపై ఆధారపడియున్నది. వాస్తవమున మిత్రుడు కృష్ణుడు. మన కుటుంబమునకు గాని, జాతికి గాని, ప్రపంచమునకు గాని మంచి జరుగవలెనని కోరినచో ఆయన వైపు మనసును త్రిప్ప వలెను. మన కుటుంబ క్షేమము మన ఉద్దేశ్యమైనచో, కుటుంబసభ్యు లందరికిని కృష్ణచైతన్యము కలుగునట్లు మనము ప్రవర్తింపవలెను. తమ కుటుంబముల బాగును గురించి యెంతోమంది పాటుపడు చుందురు గాని, పాపము ! విఫలు లగుచున్నారు. అసలు సమస్య ఏమిటో వారికి తెలియదు. భాగవతములో చెప్పినట్లు తన సంతానమును మృత్యువు నుండి, భౌతికప్రపంచము యొక్క దృఢబంధము నుండి రక్షింపజాలని వాడు తండ్రి యగుటకు గాని, గురువగుటకు గాని ప్రయత్నింప గూడదు. ప్రతి తండ్రియు కృష్ణ విజ్ఞానముగలవాడైయుండి తనకు అప్పగింపబడిన అమాయక సంతానమునకు మరల జన్మబంధము లేకుండ జేయుటకు కృతనిశ్చయుడైయుండవలెను. వారికి జనన మరణ సంసార దుఃఖము నిక యే మాత్రమును అనుభవింప నవసరము లేని విధముగా శిక్షణ యిచ్చుటకు తండ్రి నిశ్చయించుకొనవలెను. కాని, ఆ పని చేయుటకు ముందు అతడు దానిని పూర్తిగా తెలిసినవాడై యుండ వలెను. అతడు స్వయముగా కృష్ణ విద్యలో నిష్ణాతుడు కావలెను. అట్లు యినచో తన పిల్లలకు, సంఘమునకు గూడ మేలుచేయగలడు. కాని, అతడు స్వయముగ అజ్ఞానబంధములో నున్నచో, తనలోటి అజ్ఞానులతో



ఏ విధముగా ఐకమత్యము సాధింపగలడు ? ఇతరులను తరింపజేయు టకు ముందు స్వయముగా తరించిన వాడై యుండవలెను. యథార్థము నకు ఎవడును ముక్తుడు కాడు, ప్రతి వాడును ప్రకృతిప్రభావమునకు లోబడిన వాడే. కాని, కృష్ణుని ఆశ్రయించినవానిని మాయ తాకదు. అందరిలో అత డొక్కడే ముక్తుడు. ఎండలో నున్న వానికి చీకటి అను భవమే యుండదు. కాని, కృత్రిమ కాంతిలో నున్న ఆ కాంతి ఆరిపో వచ్చును. కృష్ణుడు ఎండవంటి వాడు. అత దున్నచోట చీకటిగాని, అవిద్యగాని ఉండునేమో యను ప్రశ్నే లేదు. జ్ఞానులు, మహాత్ములు దీని నెరుగుదురు.

*అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే*
*ఇతి మత్వా భజన్తే మాం బుధా భావ సమన్వితాః*

"సర్వములైన ఆధ్యాత్మిక భౌతిక ప్రపంచములకును నేనే కారణభూతు డను. సర్వము నానుండియే పుట్టును. ఇది పూర్తిగా నెరింగిన పండితులు భక్తి యుక్తమైన నాసేవలో నిమగ్నులై హృదయ పూర్వకముగా నన్ను పూజింతురు." (భ. గీ. 10.8)

ఈ శ్లోకమున 'బుధులు' అను పదము ప్రయోగింప బడినది. బుద్ధిమంతులు అని, పండితులు అని దాని అర్థము. అటువంటి వారి లక్షణమేమి ? సర్వము కృష్ణుని నుండియే జన్మించునని వారికి తెలియును. తమకు కనబడు ప్రతి వస్తువు కృష్ణుని నుండియే ఉద్భవించె నని తెలియును. భౌతికప్రపంచమునందు లైంగికజీవితము ప్రధాన విషయము. సర్వవిధప్రాణులయందును మైథునాసక్తి కనబడుచున్నది. అది ఎక్కడనుండి వచ్చినదని మీరడుగవచ్చును. ఈ స్వభావము కృష్ణు నిలో నున్నదనియు, అది గొల్లపడుచులతో ఆయనకున్న సంబంధమును బట్టి తెల్లమగుచున్నదనియు జ్ఞానులకు తెలియును. ఈ భౌతిక ప్రపంచ

మున కనబడు ప్రతి విషయము కృష్ణునియందు కూడ పరిపూర్ణముగ, అఖండముగ కనబడును. రెండింటికిని భేదమేమన ? భౌతిక లోకమునందు ప్రతి విషయము తారుమారుగ వ్యక్తమగును. కృష్ణునియందీస్వభావములు శుద్ధచిత్తములో దివ్యములై అభివ్యక్తములగును. సంపూర్ణజ్ఞానముతో దీని నెరిగినవారు కృష్ణుని శుద్ధభక్తు లగుదురు.

*మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః*
*భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్*
*సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః*
*నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే*

"ఓ పృథాకుమారా, భ్రాంతచిత్తులుకాని మహాత్ములు దివ్య ప్రకృతి రక్షణమున నుందురు. వారు నన్ను ఆద్యుడును అనంతుడును నైన దేవదేవునిగా నెరుంగుదురు. కావున వారు భక్తియుక్త సేవలో సంపూర్ణముగా నిమగ్నులై యుందురు. ఎల్లప్పుడును నా వైభవములను కీర్తించుచు, దృఢనిశ్చయముతో ప్రయత్నించుచు, నాముందు నమస్కరించుచు ఈ మహాత్ములు నన్ను నిత్యమును భక్తితో పూజింతురు." (భ. గీ. 9.13, 14)

ఈ మహాత్ములన నెవరు ? మహాశక్తి ప్రభావములోనున్న వారు మహాత్ములు. ప్రస్తుతము మనము కృష్ణుని అల్పశక్తి ప్రభావములో నున్నాము. జీవాత్మలము కావున అల్ప అనల్ప ఉభయశక్తులకు మధ్య తటస్థులుగా నున్నాము. ఈ రెండింటిలో దేనిలోనైనను మనము చేర వచ్చును. కృష్ణుడు సంపూర్ణస్వతంత్రుడు. మనము ఆయనలో అంశలము కాబట్టి ఈ స్వాతంత్ర్య గుణము మనలోగూడ నున్నది. అందువలన ఏ ప్రకృతి క్రింద నుండవలెనో మన యిష్టప్రకారము కోరుకొన వచ్చును.



దివ్యశక్తిని గురించి మనకు ఎరుకలేదు. కావున హీనశక్తికి లోబడి యుండక తప్పదు.

మన మిప్పు డనుభవించుచున్న దానికంటె వేరు ప్రకృతి లేదు. కావున దానిని నాశనముచేసి శూన్యమగుటయే ఈసమస్యకు పరిష్కారమని కొన్ని దర్శనములు సిద్ధాంతీకరించు చున్నవి. కాని, మనము చేతన వ్యక్తులము గావున శూన్యమగుట అసంభవము. మనము శరీరములను మార్చుకొన్నంతమాత్రాన శూన్యమైపోవుదుమని అర్థముకాదు. ఈజడ ప్రకృతి ప్రభావము నుండి బైటపడుటకుముందు, మనము నిజముగా ఎక్కడకు వెళ్ళుచున్నామో అర్థము చేసికొనవలెను. ఎక్కడికి వెళ్ళవలెనో మనకు తెలియనిచో "ఉన్నతశక్తి యేదో, అధమశక్తి యేదో మనకు తెలియక, మాకు తెలియునది యింతే కావున, ఇక్కడే ఉండి క్షీణించెదము" అనెదము. కాని, భగవద్గీతలో ఉన్నతాధమ శక్తులను గురించి కొంత వర్తమానము కనబడుచున్నది.

కృష్ణు డేది మాట్లాడినను అది సర్వకాలములకు వర్తించును. అది మారదు. మన వర్తమానవృత్తి యేమిటి ? అనునది గాని అర్జునుని వృత్తి యేమిటనునదిగాని లెక్కగాదు. మన చైతన్యమును మాత్రము మార్చుకొనవలెను. ప్రస్తుతము మన స్వార్థజ్ఞానమునుబట్టి పోవుచున్నాము కాని, నిజమునకు మనకు స్వార్థము తెలియదు. ఇంద్రియ విషయార్థము మాత్రము తెలియును. మన మేది చేసినను ఇంద్రియముల తృప్తికొరకే చేయుచున్నాము. ఈ చైతన్యమే మారవలెను. దాని స్థానమునందు కృష్ణచైతన్యమును స్థాపింపవలెను. అదే నిజమైన స్వార్థము.

అది ఎట్లు చేయనగును ? మన జీవితమున అడుగడుగున కృష్ణచైతన్యవంతుల మగుట ఎట్లు సాధ్యమగును ? వాస్తవమున దానిని శ్రీకృష్ణుడు మనకు బహుసులభము చేయుచున్నాడు :

రసోఽహ మప్సు కౌన్తేయ ప్రభాస్మి శశిసూర్యయోః
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు

"కౌన్తేయా! నేను నీటియందు రుచిని; సూర్యచంద్రులందు కాంతిని; వేద మంత్రములందు ఓంకారమును, ఆకాశమునందు శబ్దమును ; నరులందు పౌరుషమును అయి యున్నాను." (భ. గీ. 7 8)

ఈ శ్లోకమున మనము సర్వావస్థలయందును కృష్ణచైతన్యవంతుల మెట్లు కాగలమో కృష్ణుడు వివరించెను. జీవులందరు నీరుత్రాగక తప్పదు నీటిరుచి ఎంతబాగుగ నుండునన మనకు దాహము కలిగినప్పుడు నీరు తప్ప మరేదియు అంతటి తృప్తి కలిగించదు. ఏ కర్మాగారమైనను నీటి రుచిని ఉత్పత్తి చేయజాలదు. అందువలన నీరుత్రాగునపుడు కృష్ణుని స్మరింప వచ్చును. నీరు త్రాగకుండ ఏ దినమైనను గడవదుగదా! అనగా కృష్ణచైతన్య మక్కడ ఉన్నదన్నమాట. దానినెట్లు మరువగలము?

అదే విధముగ ఏదైన వెలుతురు వచ్చినపుడు, అదికూడ కృష్ణుడే. ఆధ్యాత్మికాకాశమున మూలతేజస్సు-అనగా బ్రహ్మజ్యోతి. కృష్ణశరీరమునుండి బయటికివచ్చి ఈ జడాకాశమును కప్పును. ఈ ప్రత్యక్ష ప్రపంచముయొక్క నిజస్వభావము చీకటి. దానిని మనము రాత్రులందు చూచుచున్నాము. దాని లోని కాంతి దానిదికాదు ; సూర్యుడిచ్చినది ; చంద్రుని ప్రతిబింబితకాంతి ; విద్యుచ్ఛక్తివలన కలిగినది. కావున అది కృత్రిమము, ఆ కాంతి ఎచటనుండి వచ్చుచున్నది? బ్రహ్మజ్యోతినుండి. అనగా ఆధ్యాత్మికలోకము నుండి మహోజ్జ్వల తేజస్సు సూర్యుని జేరును. ఆధ్యాత్మికలోకమున సూర్యచంద్రాదుల అవసరము లేదు. అక్కడ ప్రతివస్తువు బ్రహ్మజ్యోతి నుండి కాంతిని పొందుచున్నది. ఈ లోకములో సూర్యకాంతిని చూచినపుడెల్ల మనము కృష్ణుని స్మరింపవచ్చును.

ఓంకారముతో మొదలుపెట్టు వేదపాఠము విన్నపుడు కూడ



మనము కృష్ణుని స్మరింపవచ్చును. హరేకృష్ణవలె ఓంకారముగూడ కృష్ణుని నామము. ఓంకారముకూడ కృష్ణుడే. శబ్దమనగా ధ్వని. ఏధ్వని యైనను మూలధ్వనియొక్క ప్రకంపనమని మనము గ్రహింపవలెను. ఆ మూలధ్వనియే ఓం అను శబ్దము. అదే హరేకృష్ణ. భౌతికప్రపంచములో మనకు వినబడు ప్రతిశబ్దము మూలాధ్యాత్మిక శబ్దమగు ఓంకారము యొక్క ప్రతిధ్వనియే. ఈ విధముగ శబ్దము వినిపించినపుడు, నీరు త్రాగునపుడు, ఏదైనా వెలుతురు కనబడినపుడు, మనము దేవదేవుని స్మరింపవచ్చును. అది మనము చేయకలిగినచో ఎప్పుడు కృష్ణుని స్మరింపము? ఇది కృష్ణచైతన్యపద్ధతి. ఈ విధముగ దినమున ఇరువదినాలుగు గంటలు మనము కృష్ణుని స్మరింపగలము. కృష్ణుడు మనతోడనే ఉండగలడు. నిజమునకు కృష్ణుడు సర్వదా మనతోడనే ఉన్నాడు. కాని, ఈ విషయము మనము జ్ఞాపకము తెచ్చుకొన్నవెంటనే కృష్ణసాన్నిధ్యము యథార్థమై అనుభవమునకు వచ్చును.

దేవుని సాన్నిధ్యముకొరకు తొమ్మిది కార్యక్రమములున్నవి. మొదటిది శ్రవణము—వినుట భగవద్గీత చదువుట వలన మనము శ్రీకృష్ణుని వాక్కులను వినుచున్నామనియు, కృష్ణుని సహవాసము నిజముగ చేయుచున్నామనియు అర్థము. (కృష్ణుని గురించి మాట్లాడినపుడెల్ల భగవంతుని గురించియేయని మరువరాదు) భగవంతునితో—సహజీవనము చేయుచు కృష్ణవాక్కులను నామములను స్మరించుచుపోయినచో జడప్రకృతి సంపర్క దోషములు తగ్గిపోవుచుండును. కృష్ణుడే శబ్దము. వెలుతురు, జలము ఇంకను అనేక పదార్థములై యున్నాడని తెలిసికొన్నచో కృష్ణుని తప్పించుకొనుట అసాధ్యమగును. ఈపద్ధతిలో కృష్ణుని మనము స్మరింపగలిగినచో ఆయన సన్నిధి మనకు శాశ్వత మగును.

కృష్ణసన్నిధి ఎండలో కూర్చుండుటవంటిది. ఎండ ఉన్నచోట అశుచి యుండదు. సూర్యుని అతిపాటల (ఊదా) కిరణములలో అరు

బైట కూర్చున్నంత సేపు మనకు రోగమురాదు. సర్వవ్యాధులకు సూర్య కాంతి చికిత్సగా ప్రశంసింపబడు చున్నది. శాస్త్రములు వ్యాధిగ్రస్తుడు ఆరోగ్యముకొరకు సూర్యుని ఆరాధింపవలెనని చెప్పుచున్నవి. అట్లే మనము కృష్ణచైతన్యములో, కృష్ణుని సన్నిధిలో నున్నచో మన జబ్బు లన్నియు నయమగును. హరేకృష్ణ జపముచే కృష్ణుని చేరగలము ; జల మును కృష్ణునిగా చూడగలము. సూర్యునిలో, చంద్రునిలో కృష్ణుని చూడగలము ; శబ్దములో కృష్ణుని వినగలము. నీటిలో కృష్ణుని రుచి చూడగలము. దురదృష్టవశమున మన వర్తమాన పరిస్థితులలో కృష్ణుని మరచినాము. కాని, ఇప్పుడైనను ఆయన స్మరణద్వారా ఆధ్యాత్మిక జీవనమును పునరుద్ధరించు కొనవలెను.

ఈ శ్రవణకీర్తనక్రమము – అనగా వినుట, జపముచేయుట చైతన్య మహాప్రభువుచే ఆమోదింపబడినది. తన మిత్రుడును, మహా భక్తుడును అగు రామానందరాయునితో సంభాషించునపుడు చైతన్య మహాప్రభువు ఆత్మసాక్షాత్కారమును గురించి ప్రశ్నించెను. రామానం దుడు వర్ణాశ్రమధర్మములను, వైరాగ్యమును కర్మసన్న్యాసము మొదలగు అనేక మార్గములను చెప్పెను. కాని చైతన్యమహాప్రభు విట్లనెను. "కావున అవన్నియు ఏమంత మంచివికావు" రామానందుడు ఏదో మార్గము చెప్పినప్పు డెల్ల చైతన్య మహాప్రభువు ఆధ్యాత్మికాభివృద్ధికి అంతకంటె మంచిమార్గము చెప్పుమనుచుండెను. చివరకు రామానందరాయ డొక వేదమంత్రమును ఉదాహరించి, తత్ప్రకారము పరమార్థసత్యమును చేరుట ఊహాకల్పనలతో సాధ్యము కాదుకాబట్టి, దేవదేవుని తెలిసికొను టకు మానసికోహలతో జేయు అనవసర ప్రయత్నములను, తర్క వితర్కములను మానవలెననెను. విజ్ఞానశాస్త్రజ్ఞులు అతిదూరమున నున్న నక్షత్రములను గురించి, గ్రహములను గురించి ఊహాగానములను చేయు



దురు. కాని, అనుభవములేకుండ వారెట్టి నిర్ణయమునకును రాలేరు. ఇట్లే దేనిని గురించి ఎవరైనను యావజ్జీవము ఊహాకల్పనలతోను, అనుమాన ములతోను గడపినను ఎన్నటికిని ఏదియును నిర్ణయింపలేరు.

ప్రత్యేకముగ భగవంతుని గురించి ఊహాకల్పనలు, అనుమాన ములు వృథా. అందువలన ఊహాకల్పన లన్నిటిని విరమించు కొనవలెనని శ్రీమద్ భాగవతము చెప్పుచున్నది : దానికిమారు తాను కేవలము అత్యల్పుడననియు, ఈ విశాలవిశ్వములో ఈ భూలో కము ఒక అత్యల్పమైన అణువనియు గ్రహించి వినయముగ నుండుట మంచిదని ఉపదేశించినది. న్యూయార్క్ నగరము చాలా పెద్దదిగా కన బడవచ్చునుగాని. ఈ భూగోళమే అత్యల్పమగు అణుమాత్రమేయనియు దానిలో సంయుక్త రాష్ట్రములు ఒక చిన్న భాగమనియు, దానిలో న్యూయార్క్ నగరము మరియును చిన్నదనియు, న్యూయార్కు లోని వ్యక్తి లక్షలమందిలో ఒకడనియు గ్రహించిన వానికి తానొక లెక్క లోనివాడు కానేకాడని తెలియును. బ్రహ్మాండములోను, దేవదేవునితోను పోల్చిచూచినపుడు మన అత్యల్పత్వమును గుర్తించిన మనము గర్వమును విడనాడి విధేయత కలిగియుండవలెను. కూపస్థమండూక సిద్ధాంతములో పడిపోకుండ మనము జాగ్రత్తపడవలెను. ఒకప్పుడు ఒక నూతిలో ఒక కప్ప ఉండెనట. ఒక మిత్రుడు చెప్పగా అట్లాంటిక్ మహాసముద్రము అనునది ఉన్నదని విని మిత్రుని అడిగినదట :–

"అటులనా ? అట్లాంటిక్ సముద్రమనగా ఏమిటి ?"

"అది యొక మహా విశాల జలనిధి", అనెను మిత్రుడు.

"ఎంత విశాలము ? ఈ నూతికి రెట్టింపుండునా ?"

"అబ్బే ! అట్లేమియుకాదు. చాల చాల పెద్దవి," అని మిత్రు డనెను.

"ఇంకను ఎంత పెద్దది ? దీనికి పదిరెట్లా?"




ఈ ప్రకారముగా ఆ కప్ప ఊహించుకొనుచు పోయెను. కాని ఆ మహా సముద్రముయొక్క వైశాల్యమునుగాని, లోతుగాని, అర్థము చేసికొనుటకు ఆ కప్పకు సాధ్యమేనా ? మనసామర్థ్యములు, అనుభవములు, కల్పనా శక్తి అన్నియు పరిమితములు. కనుక మనము ఆ కూపస్థమండూక సిద్ధాంతమున కవకాశమివ్వగలము. అందువల్ల దేవదేవుని అర్థము చేసికొనుటకు ప్రయత్నించుటలో ఊహాపద్ధతి వృధాకాలక్షేపమని శ్రీమద్ భాగవతము చెప్పుచున్నది.

ఊహలు వదలిపెట్టి మనమేమి చేయవలెను ? మనము వినయము కలిగి భగవంతుని ఉపదేశములను విధేయతతో వినవలెనని భాగవతము ఉపదేశించుచున్నది. ఆ ఉపదేశము భగవద్గీతయందును, లేదా సాహిత్యము నందును కనబడును. అది బైబిలు, ఖురానులలోను, ఏ ప్రసిద్ధమైన గ్రంథములోనైనను కానవచ్చును. లేదా, జీవన్ముక్తుల నుండి తెలిసికొనవచ్చును. ముఖ్యముగా చెప్పవచ్చినదేమన, భగవంతుని గూర్చి శ్రవణము చేయవలెనేగాని, ఊరకనే ఊహించుకొనగూడదని. అట్టిశ్రవణమునకు ఫలితమేమిటి ? అది చేయువారెవరైనను–దరిద్రుడుగాని, ధనికుడుగాని, అమెరికనుగాని, భారతీయుడుగాని, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులలో ఎవరైనను–భగవంతుని దివ్యనామము విన్నచో, ఎట్టిశక్తి చేతను జయింపబడక, భగవంతుని ప్రేమచే జయింపబడును. అర్జునుడు కృష్ణునికి మిత్రుడు. కాని, దేవదేవుడైన కృష్ణుడు నీచభృత్యునివలె అర్జునునికి సారథియాయెను. అర్జునుడు కృష్ణుని ప్రేమించెనుగాన, కృష్ణుడు తన ప్రేమను ఆవిధముగ ప్రకటించెను. అట్లే, కృష్ణుడు బాలుడుగా నున్నప్పుడు తండ్రియగు నందుని పాదరక్షలను తన నెత్తి మీద పెట్టుకొనెను ; వానితో ఆడుకొనునట్లు నటించెను. దేవదేవునితో ఐక్యము పొందుటకు ఎవరైనను ఎంతో ప్రయత్నింప వచ్చునుగాని, నిజమునకు, అంతకంటె ఎక్కువే సాధింపవచ్చును. మనము భగవంతుని



తండ్రులము కావచ్చును. సర్వభూతములకును భగవంతుడే తండ్రియనునది యథార్థమే; ఆయనకు తండ్రి లేనిమాట నిజమే. కాని, దేవదేవుడు తన భక్తుని తండ్రిగా స్వీకరించి, వానిపై వాత్సల్యముచే వానిచే జయింపబడుటకు అంగీకరించును. మనము చేయవలసినది ఒక్కటే–దేవదేవుని ఉపదేశమును శ్రద్ధగా వినుటయే.

భగవద్గీత సప్తమాధ్యాయములో శ్రీకృష్ణుడు జీవితములో అడుగడుగునను తనను తెలిసికొనుటకు మరికొన్ని మార్గములను చూపించినాడు ;

*పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ*
*జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు*

"నేను భూమియొక్క ఆద్యమైన వాసనను ; అగ్నియందు వేడిమిని జీవించు సర్వప్రాణులయందును ప్రాణమును, తపస్వులయందు తపస్సును." (భ. గీ. 7.9)

పుణ్యోగన్ధః అను మాటలకు సువాసన అని అర్థము. కృష్ణుడు మాత్రమే మంచి వాసనలను, రుచులను సృజింపగలడు. రసాయనముల సమ్మేళనముతో మనము కృత్రిమ సుగంధ ద్రవ్యములను తయారుచేయవచ్చును గాని, అవి ప్రకృతి సిద్ధములంత శ్రేష్ఠములుగావు. ప్రకృతి సిద్ధమైన పరిమళము నాఘ్రాణించినపుడు "ఆహా, భగవంతు డిక్కడ ఉన్నాడు కృష్ణు డిక్కడున్నాడు" అనిపించును. లేదా ఒక సహజ సౌందర్యము కనబడినపుడు "ఇదిగో కృష్ణుడు!" అనిపించును. లేదా, అసాధారణము, మహాశక్తిమంతము, అద్భుతమునగు దానిని చూచినచో "ఇదిగో కృష్ణుడు!" అని మన కనిపించును. లేదా చెట్లలోగాని, మొక్కలలోగాని, మృగములలో గాని, మానవులలోగాని ఏవిధమైన చైతన్యము కనబడినను ఆ చైతన్యము కృష్ణునిలో అంశమే అని మనము గ్రహింప

వలెను. ఎందుకనగా కృష్ణాంశభూతమగు ప్రాణాగ్ని స్ఫులింగము ఆ శరీరమునుండి తొలగిపోగానే అది క్రుళ్ళిపోవుట ఆరంభించును.

*బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్*
*బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మాహమ్*

"ఓ పృథా కుమారా ! నే నన్ని భూతములకు ఆద్యకారణమును అనియు బుద్ధిమంతులలో బుద్ధియనియు, శక్తిమంతులలో శక్తియనియు యెరుంగుము." (భ. గీ 7.10)

ఇక్కడ మరల కృష్ణుడు సర్వప్రాణులలోని ప్రాణము తానేనని ప్రత్యేకముగా చెప్పెను. ఈ విధముగా ప్రతిక్షణము భగవంతుని చూడవచ్చును. "నీవు దేవదేవుని నాకు చూపింపగలవా ?" అని యెవడైనను అడుగవచ్చును. ఓ తప్పక. దేవు డనేకవిధములుగ కనబడును. కాని, కన్నులు మూసికొని, "నాకు దేవుడు కనబడుటలేదు." అనువానికి దేవు డెట్లు కనబడును ?

పై శ్లోకమున బీజమ్ అనగా విత్తనము. ఆ విత్తనము సనాతనమైనదని ప్రకటింపబడినది. ఒక పెద్ద చెట్టున్నదనుకొనుడు. కాని, దాని మూలమేది ? అదే విత్తనము. ఆ విత్తనము శాశ్వతము. ప్రతిప్రాణి లోపల దాని ఉనికియొక్క బీజమున్నది. దేహము స్వయముగా అనేక వికారములను పొందవచ్చును—తల్లి గర్భములో పెరుగుట, చిన్నదేహముగా బైటకు వచ్చుట, కౌమార యౌవనదశలను పొందుట, కాని, ఈ యన్నిటికిని మూలమై, అంతర్గతమైయున్న బీజము నిత్యము. అందువలననే, అది సనాతనము. మనకు తెలియకయే మనము మన శరీరములను ప్రతిక్షణమును మార్చుకొనుచున్నాము. కాని, ఆ విత్తనము, చైతన్య స్ఫులింగము మారదు. ప్రతి వస్తువునందును ఉన్నట్టి ఆ శాశ్వతబీజము తానేనని కృష్ణుడు చాటుచున్నాడు. బుద్ధిమంతులలోని బుద్ధికూడ తానే.



కృష్ణుని అనుగ్రహము లేనియెడల అసాధారణప్రజ్ఞ ఎవరికిని ఉండదు. ప్రతివాడును ఇతరులకంటె ఎక్కువ తెలివిగానుండవలెనని ప్రయత్నించును. కాని, కృష్ణానుగ్రహము లేనిచో, అది సంభవించదు. కాబట్టి అసాధారణప్రజ్ఞ గలవారెవరైనను మనకు ఎదురుపడినప్పుడు "ఈ ప్రజ్ఞ కృష్ణుడు" అని మనము తెలిసికొనవలెను. అదే విధముగా మహాప్రభావము గలవారి ప్రభావముగూడ కృష్ణుడే.

*బలం బలవతాం చాహం కామరాగ వివర్జితమ్*
*ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ*

"భరత వంశస్థులలో శ్రేష్ఠుడైన ఓ అర్జునా ! నేను బలవంతులలో కామాసక్తులులేని బలమును, మత సిద్ధాంతములకు వ్యతిరిక్తముగాని సంభోగమును." (భ. గీ. 7.11)

ఏనుగు, గెరిల్లాయను పెద్దకోతి చాల బలముగల మృగములు. వానికి ఆ బలము కృష్ణుని నుండియే వచ్చినదని మనము గ్రహింపవలెను. మానవుడు స్వప్రయత్నముతో అంత బలము సంపాదింపలేడు. కాని, కృష్ణకృప యున్నచో అంతకన్న వేయిరెట్లెక్కువ బలమునుపొందగలడు. అట్లే ? మత సిద్ధాంత సమ్మతమైన స్త్రీసంభోగమును గూడ కృష్ణుడుగా భావింపవలెను. కామ మననేమి ? సామాన్యముగా కామ మనగా స్త్రీ సంభోగ వాంఛ; ఇక్కడ మత సిద్ధాంతములకు విరుద్ధముకాని లైంగిక జీవనము. అనగా సత్సంతానమును పొందుటకు సాధనమైన కామము. కృష్ణచైతన్యముగల సంతానమును పొందినట్లయిన వేయిమార్లు కామసుఖమును పొందవచ్చును. కాని, పిల్లులు కుక్కల మన సత్త్వముగల సంతానము కలిగినచో అతని కామము మత సిద్ధాంతవిరుద్ధము. ధార్మిక నాగరిక సంఘములలో వివాహోద్దేశము దంపతులు సత్సంతానము పొందుటకు లక్షణముగా భావింపబడుచున్నది. కాబట్టి వివాహిత దాంప

త్యము ధర్మవిరుద్ధము. వాస్తవమున శాస్త్రీయ పద్ధతులలో వివాహిత దాంపత్యజీవనము గల గృహస్థునికిని, సన్న్యాసికిని ఎలాంటి భేదము లేదు.

యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే
మత్త ఏవేతి తాన్ విద్ధి న త్వహం తేషు తే మయి

"సత్త్వగుణముతో కూడినట్టిగాని, రజోగుణముతో కూడినట్టిగాని, తమోగుణముతో కూడినట్టిగాని భావములన్నియు నా శక్తిచేతనే వ్యక్తీకృతములైనవని ఎరుంగుము. ఒక విధముగా నేను సర్వమును, స్వతంత్రుడును. నేను భౌతిక ప్రకృతి గుణములకు లోబడి యుండను. కాని, అవి నాయందుండును." (భ. గీ. 7.12)

కృష్ణుని ఎవరైనను ఈ విధముగా అడుగవచ్చును. శబ్దము, నీరు, వెలుతురు, పరిమళము, సర్వమునకు బీజము, బలము, కామము నీవే యనుచున్నావు. అనగా, మంచి భావములలో మాత్రమే నీవుందువని అర్థమా? భౌతిక ప్రపంచమున సాత్త్విక రాజస తామస భావములున్నవి. ఇంతవరకు సాత్త్వికభావములే నేనని చెప్పికొనినావు (ఉదాహరణమునకు ధర్మ సమ్మతమైన కామము) కాని, ఇతర భావములమాటయేమిటి? వానిలో నీవు లేవా? దానికి సమాధానముగా భౌతికప్రపంచమున కనబడు ప్రతిభావము (అనగా వస్తువు) సత్త్వరజస్తమో గుణముల కలయిక వలననే ఏర్పడుచున్నది. అన్నిటిలోను ఈ మూడు సందర్భములు "నా చేతనే సృజింపబడుచున్నవి." అని కృష్ణు డనెను. కృష్ణునిచే సృజింపబడిన వగుటవలన వాని స్థానముకూడ కృష్ణునియందే యున్నది. కాని కృష్ణుడు వానిలో లేడు. కారణము_కృష్ణుడు స్వాయముగా వాని కతీతుడు. దాని భావమేమన? అవిద్యవలన కలుగు అశుభములు, అశుద్ధములు అన్నియుకూడ కృష్ణుడే. ఎప్పుడు కృష్ణునిచే ప్రయోగింపబడినప్పుడు. అదెట్లు? ఉదాహరణమునకు ఒక విద్యుదభి



యంత (ఇంజనీరు) విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయుచున్నాడు. మన యిండ్లయందీ విద్యుచ్ఛక్తిని శీతలీకరణ యంత్రములో (ఫ్రిజ్‌లో) శీతలముగాను, విద్యుద్దసంతియందు ఉష్ణముగాను వాడుకొనుచున్నాము. కాని ఉత్పత్తిస్థానములో అది శీతలమునుగాదు, ఉష్ణమునుగాదు విద్యుచ్ఛక్తి యొక్క అవిష్కారము ప్రాణులకు నానావిధములుగ నుండును కాని శ్రీకృష్ణునికి నానా విధములుగా నుండదు. అందువలన కొన్ని సమయములలో కామిగను, అజ్ఞానిగను నటించును. కాని, కృష్ణునికి తనుతప్ప మరొకటి లేదు ఎట్లన విద్యుచ్ఛక్తి అదియంతకు ఆ శక్తి కేవలము శక్తియేగాని, అతనికి 'ఇది ఉష్ణ విద్యుచ్ఛక్తి యను భేదము లేదు.

ప్రతి పదార్థమును కృష్ణుడే ఉత్పత్తి చేయుచున్నాడు. దీనినే వేదాంత సూత్రములు "అథాతో బ్రహ్మజిజ్ఞాసా, జన్మాద్యస్యయతః" అనునవి సమర్థించుచున్నవి. ఒక ప్రాణి మంచిదనికాని, చెడుదనిగాని భావించుట, ప్రతి ప్రాణియు బద్ధుడు కాబట్టి ఆ ప్రాణిని బట్టియే. కాని, కృష్ణుడు బద్ధుడు కానందున ఆయనకు మంచి చెడు భేదములు లేవు. మనము బద్ధులము కావున ద్వంద్వదుఃఖము అనుభవించుచున్నాము. కాని, కృష్ణునికి సర్వము సంపూర్ణమే.

# 4. మూఢుల, వివేకుల మార్గములు

కృష్ణుడు తన స్వరూపమును ఈ విధముగ వివరించుచున్నాడు. అయినను మన మనస్సు ఆయనవైపు మరలుట లేదు. ఎందువల్ల? కారణము కృష్ణుడే స్వయముగ చెప్పెను:

*దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా*
*మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే*

"భౌతిక ప్రకృతికి సంబంధించిన మూడు గుణములతోకూడిన నా దివ్య శక్తి దాటుటకు శక్యము కానిది కాని, నన్ను శరణు పొందినవారు దానిని సులభముగా దాటజాలుదురు." (భ. గీ. 7. 14)

భౌతిక ప్రపంచమంతట మూడు ప్రకృతి గుణములు వ్యాపించియున్నవి. జీవులందరు వాని ప్రభావమునకు లోబడియుందురు. సత్త్వ గుణప్రభావితులు బ్రాహ్మణు లనబడుదురు. రజోగుణ ప్రభావితులు క్షత్రియులు, రజస్తమస్సులచే ప్రభావితులు వైశ్యులు తమస్సుచే ప్రభావితులు శూద్రులు. ఇది జన్మనుబట్టికాని, సామాజికమగు హోదానుబట్టి కాని, జరిగిన కృత్రిమమైన బలవంతపు ఏర్పాటుకాదు. గుణములను (ఏ ప్రకృతి విశేషముతో ఒకడు జీవించునో వాటిని) బట్టి జరిగినది.

*చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః*
*తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్*

"సత్త్వరజస్తమో గుణముల ననుసరించియు వారువారు చేయు కర్మల ననుసరించియు మానవ సంఘమును నాల్గు జాతుల వారినిగా విభజించితిని. నేను ఆ నాలుగు వర్ణములను సృజించిన కర్తనైనను నేను మార్పు



లేని వాడ నగుటచే వానిని సృజింపనే లేదని తలంచుము." (భ. గీ. 4 13)

ఇది భారతదేశములో ఇప్పుడున్న విపరీత చాతుర్వర్ణ్యమును గురించి చెప్పినదికాదు. శ్రీకృష్ణుడు స్పష్టముగా "*గుణకర్మ విభాగశః*" అనుచున్నాడు. గుణమునుబట్టియు-దేనిక్రింద జీవనము జరుగుచున్నదో దానిని బట్టియు మానవులు విభజింపబడిరి గాన, ఇది ప్రపంచములో మానవులందరికిని చెల్లును. కృష్ణు డేది చెప్పినను అది పరిమితము కాదనియు, సార్వత్రికమనియు మనము గ్రహింపవలెను. సర్వభూతములకును తాను తండ్రినని చెప్పుకొనుచున్నాడు కావున జంతువులకు జలచరములకు, వృక్షములకు, పురుగులకు, పక్షులకు, ఈగలకు, ఆయన తండ్రి. అన్నియును కృష్ణుని సంతానమే. భౌతిక ప్రకృతియొక్క మూడు గుణముల పరస్పరానుకూల ప్రవర్తనవలన యావత్ప్రపంచము అజ్ఞానములో పడినదనియు మనముకూడ ఆ అజ్ఞాన ప్రభావములో ఉన్నామనియు. కాబట్టి భగవంతుని తెలిసికొనలేక పోవుచున్నామనియు శ్రీకృష్ణుడు స్పష్టముగా ప్రకటించెను గదా!

*దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా*
*మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే*

"భౌతిక ప్రకృతికి సంబంధించిన మూడు గుణములతోకూడిన నా దివ్య శక్తి దాటుటకు శక్యము కానిది. కాని, నన్ను శరణు పొందినవారు దానిని సులభముగా దాటజాలుదురు." (భ. గీ. 7.14)

కేవల వితర్కములచే భౌతిక ప్రకృతియొక్క ఈ మూడు గుణముల చిక్కును ఎవరును వదలించుకొనజాలరు. ఈ మూడు గుణములు చాల ప్రబలములు, అజేయములు. భౌతిక ప్రకృతియొక్క దృఢ బంధములో మనమున్నట్లు మన అనుభవమువలన తెలియుట లేదా?

గుణశబ్దమునకు త్రాడు అను నర్థముకూడ నున్నది. ఎవడైనను మూడు గట్టిత్రాళ్ళచే బంధింపబడినచో తప్పించుకొనలేడు. మన కాళ్ళుచేతులు మంచితనము, కామావేశము, అజ్ఞానము అను మూడు బలమైన త్రాళ్ళచే కట్టివేయబడి యున్నవి. ఆ కారణమున మనము ఆశ వదలుకొనవలసిన దేనా ? లేదు. ఇక్కడ, తనను ఆశ్రయించిన వారెవరైనను వెంటనే విముక్తులగుదురని కృష్ణుడు ప్రతిజ్ఞచేసెను. కృష్ణచైతన్యము పొందిన వాడు ఏదో ఒక విధముగ విముక్తుడగును.

కృష్ణుని పుత్రులముగాన మనకందరికిని కృష్ణునితో సంబంధ మున్నది. పుత్రునికి తండ్రితో అభిప్రాయభేద ముండవచ్చుగాని, పితృ పుత్ర సంబంధమును త్రెంచుకొనుట సాధ్యముకాదు. జీవితములో నెన్న డైనను ఎవరైన "నీవెవరవు ?" అని అడిగినచో "నేను ఫలానావారి కుమారుడను" అని చెప్పవలసి వచ్చును. ఆ బంధుత్వము తెగిపోదు. మనమందరము దేవదేవుని పుత్రులము ఆయనతో అటువంటి సంబం ధము నిత్యము. కాని, మనము దానిని స్మరించుటయేలేదు. కృష్ణుడుసర్వ శక్తిమంతుడు. సర్వ కీర్తిమంతుడు. సర్వ సంపన్నుడు, అత్యంత సుంద రుడు, సర్వజ్ఞుడు, అంతేకాక సంపూర్ణ త్యాగికూడ. అటువంటి ఉత్త మోత్తమ పురుషునికి మిత్రులమైనను దానిని మరచితిమి. ఒక ధనికుని పుత్రుడు తన తండ్రిని మరచిపోయినచో, ఇల్లు విడచి పిచ్చివాడై వీధిలో పడి నిద్రించును ; లేదా అన్నముకొరకు బిచ్చమెత్తుకొనును. ఈ అవస్థ అంతటికిని కారణము తనతండ్రిని మరచిపోవుట. కాని ఎవరైనను, అతని దురవస్థకు కారణము తన తండ్రి యిల్లు విడచిపెట్టుట యనియు, సంపన్నుడైన అతని తండ్రి కుమారుడు యింటికి తిరిగి రావలెనని ఆతు రతతో ఉన్నాడనియు చెప్పినచో గొప్ప మేలు చేసినవారగుదురు.

ఈ భౌతిక ప్రపంచములో మన మెల్లప్పుడును ఆధ్యాత్మిక, ఆది భౌతిక, అధిదైవికము లను మూడు విధములగు దుఃఖములచే బాధపడు



చున్నాము. దేహము వలన మనస్సు వలన కలుగుబాధలు ఆధ్యాత్మిక ములు. ఇతర ప్రాణుల వలన కలుగునవి ఆధిభౌతికములు. ప్రకృతి ప్రకోపమువలన కలుగునవి ఆధిదైవికములు. త్రిగుణములచేతను, మాయచేతను ఆవరింపబడినందున మనము దుఃఖములను లెక్కచేయము. కాని భౌతిక ప్రపంచములోనే మనము దుఃఖములన్నిటిని ఇంత అధిక ముగా అనుభవించుచున్నామనుట సదా గ్రహించవలెను. చైతన్యమును కావలసినంత వృద్ధిచేసికొనినవాడు తెలివి గలవాడు. తనకు దుఃఖ మెందుకు వచ్చుచున్నదని ప్రశ్నించుకొనును. "నేను దుఃఖములను కోరుటలేదు. నే నెందుకు దుఃఖపడుచున్నాను ?" ఈ ప్రశ్న పుట్టినచో కృష్ణచైతన్యము గలవాడగుటకు అవకాశమున్నది.

మనము కృష్ణునికి సంపూర్ణముగ శరణాగతులమైనవెంటనే ఆయన మనకు హృదయ పూర్వకముగ స్వాగతమిచ్చును. తప్పిపోయిన బిడ్డ తండ్రివద్దకు తిరిగివచ్చి, "ఓ తండ్రీ ! అపార్థం చేసికొనుటచే నీ రక్షణను వదలితిని. కాని, బాధపడితిని. ఇప్పుడు నీవద్దకు మరల వచ్చి నాను." అన్నచో, తండ్రి అతనిని కౌగిలించుకొని, "నా ప్రియతమా రమ్మ నీవు వెళ్ళినది మొదలు ఇన్నిదినములు నేను నీకొరకు ఆదుర్దాగా ఉన్నాను. నీవు తిరిగి వచ్చితివిగాన, నాకిప్పుడు సంతోషముగానున్నది" అనును. తండ్రి ఇంతటి వాత్సల్యము గలవాడు. మనము అదే స్థితిలో నున్నాము. మనము కృష్ణునికి పూర్తిగా శరణాగతులము కావలెను. అది ఏమంత కష్టముకాదు. కొడుకు తండ్రివద్దకువచ్చి చేరుట కష్టమైన పనియా ? అది చాల సహజము. కొడుకును స్వీకరించుటకు తండ్రి సదా సిద్ధముగనే యుండును. అవమాన మను ప్రశ్నయే లేదు. మన పరమపితను సమీపించి ఆయన పాదములను తాకినచో మనకు హాని యేమియును లేదు. అది కష్టమగు పనికూడ గాదు. నిజమునకు అది కీర్తికరము. మన మెందు కావనిని చేయగూడదు ? కృష్ణుని శరణు

పొందుటవలన మనము తత్క్షణము ఆయన రక్షణలోనికి వచ్చి సర్వదుఃఖములనుండి విముక్తుల మగుదుమన్నమాట. ఇది సర్వశాస్త్ర సమ్మతము. గీతలో కృష్ణుడు చివరకు ఇట్లనుచున్నాడు :

*సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ*
*అహం త్వాం సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః*

"వివిధ ధర్మములను విడిచి నన్ను శరణుపొందుము. అన్ని పాపఫలితములనుండి నిన్ను విడిపింతును. భయపడకుము." (భ. గీ. 18.66)

మనము భగవంతుని పాదములపై వ్రాలినపుడు, ఆయన రక్షణలోనికి వత్తుము. ఆక్షణము మొదలు మనకు భయముండదు. బిడ్డలు తలిదండ్రుల రక్షణలో నున్నప్పుడు తమకు హాని కలుగకుండ తలిదండ్రులు చూచెదరుగాన నిర్భయముగా నుందురు. "మామేవ యే ప్రపద్యంతే" తనను ఆశ్రయించిన వారికి భయమే లేదని కృష్ణుడు ప్రకటించెను.

కృష్ణ ప్రతిపత్తి అంతసులభమైన యెడల మానవులు దానినెందుకు పాటించరు ? పాటింపకపోగా, దేవదేవుని ఉనికినే ప్రశ్నించువారు చాలమంది ఉన్నారు. ప్రకృతి, విజ్ఞానశాస్త్రమే సర్వము ; దేవుడు కల్ల అందురు. జ్ఞానమునందు నాగరకతాభివృద్ధి యనుదాని అర్థము మానవజాతికి పిచ్చి హెచ్చుచున్న దనుట. ఈ వ్యాధి తగ్గుటకుమారు ముదురుచున్నది. జనులు దేవదేవుని లెక్కచేయరు ; ప్రకృతినే లెక్కచేయుదురు. ఇక వారిని మూడు విధములగు దుఃఖములతో తన్నుటయే ప్రకృతి పని. ప్రతిదినము, ఇరువది నాలుగు గంటలు ప్రకృతి చేతిలో ఈ తన్నులు తినుచనే యున్నాము. కాని, ఈ తన్నులు తినుట ఎంత అలవాటయినదనగా, అది బాగుగనే యున్నదనియు, సాధారణమైన విషయమనియు మన కనిపించుచున్నది. మనము నేర్చు విద్యను జూచి



గర్వ పడుదుము. కాని, భౌతిక ప్రకృతితో మమ్ము తన్ను చున్నందుకు నీకు కృతజ్ఞులము, దయచేసి తన్నుట మానవద్దు అనుచున్నాము. ఈ విధమైన భ్రమలో పడి ప్రకృతిని జయించితిమని అనుకొనుచున్నాము. కాని, ఇట్లెందుకు ఉన్నది ? ప్రకృతి జన్మ మృత్యు జరావ్యాధి దుఃఖములతో మనలను బాధించుచునే యున్నది. ఈ సమస్యల నెవడైనను పరిష్కరించెనా ? కానిచో వాస్తవమునకు జ్ఞానమునందును, నాగరకతయందును మనము ఏమి ప్రగతి సాధించినట్లు ? ప్రకృతియొక్క అనుల్లంఘ్యశాసనములకు బద్ధులమై యున్నాము. అయినను మన మా ప్రకృతిని జయించితిమని భావించుచున్నాము. దీనినే 'మాయ' అందురు.

ఈ దేహమును కన్నతండ్రికి శరణాగతుడగుటలో మనకు కొంత కష్టము కలుగవచ్చును. ఎందుకనగా, అతనికున్న జ్ఞానము, సామర్థ్యము పరిమితములు గనుక. కాని, కృష్ణుడు సామాన్యమైన తండ్రి కాడు. అతడు అనంతుడు; ఆయన యొక్క జ్ఞానము, శక్తి, సంపద, సౌందర్యము, కీర్తి, వైరాగ్యము అపరిమితములు; పరిపూర్ణములు. మనము అటువంటి తండ్రియొద్ద జేరి ఆయన సంపదను అనుభవించుట అదృష్టమనుకొనవలదా ? కాని, ఎవడును దీనిని పట్టించుకొన్నట్లు లేదు. పైగా ఇప్పుడు, దేవదేవుడు లేడని ప్రచారము చేయుచున్నారు. అయనను జను లెందుకు వెదకి కనుగొనరు ? దీనికి ప్రత్యుత్తరము తరువాతి శ్లోకములో చెప్పబడినది :

*న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః*
*మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః*

"చెడ్డపనులు చేయువారును, మూఢులును, మానవాధములును, మాయచే అపహరింపబడిన జ్ఞానము గలవారును, రాక్షసులకు సంబంధించిన నాస్తికస్వభావముతో కూడినవారును నన్ను శరణుపొందజాలరు." (భ. గీ. 7.15)

పై విధముగా మూఢులు వర్గీకరింపబడిరి. దుష్కృతుడగువాడు శాస్త్రవిధులకు వ్యతిరేకముగా ప్రవర్తించును. వర్తమాన నాగరికత శాస్త్రవిధులను ధిక్కరించుటయే తన పనిగా పెట్టుకొన్నది. అంతే. ఆ లక్షణమును బట్టి సుకృతుడనగా శాస్త్రధిక్కారము చేయనివాడు. సుకృతునికి, దుష్కృతునికి గల భేదమును నిర్ణయించుటకు ఒక కొలత ఉండవలెను. ప్రతి నాగరిక దేశములోను ఒక పవిత్ర గ్రంథమున్నది – అది బైబిల్ కావచ్చును, ఖురాను కావచ్చును, వేదము కావచ్చును. ధర్మపథము కావచ్చును. అది ప్రధానముకాదు. పవిత్రగ్రంథమొకటి యున్నది అనునది ప్రధానము. దాని ననుసరించని వాడు వెలివేయబడినవాడుగ భావింపబడును అతడే దుష్కృతుడు.

ఈ శ్లోకమున పేర్కొనబడిన మరియొక వర్గము మూఢులు. మొదటి తరగతి మూర్ఖులు. నరాధముడు మానవసంఘమున అట్టడుగున నున్నవాడు, ఇక మాయాపహృత జ్ఞానులనగా మాయచే అపహరింపబడిన జ్ఞానము గలవారు. 'ఆసురం భావ మాశ్రితాః' అనగా పూర్తిగా నాస్తికులు. జగజ్జనకుని ఆశ్రయించుటలో హానిలేకున్నను ఈ నాల్గువర్గముల వారు ఆయన నాశ్రయింపరు. తత్ఫలితముగా దేవదేవుని కింకరులచే నిత్యము దండింపబడుదురు. వారిచెంప వగులకొట్టి, బెత్తముతోకొట్టి, తన్ని, తీవ్రముగా బాధపెట్టవలెను. తనను ఎదిరించు దుష్టపుత్రుని తండ్రి దండించునట్లు భౌతికప్రకృతి కొన్ని దండనలు విధించవలసి వచ్చును. అయినను ప్రకృతి మనకు ఆహారమును, ఇతరావసరములను అందించుచు పోషించుచున్నది. ఈ రెండు క్రమములును మన మపరిమితైశ్వర్యవంతుని కొడుకులము గనుక సాగుచునే యుండును. మనము శరణు పొందకపోయినను కృష్ణుడు మనపై దయచూపించుచునే యున్నాడు. ఈ విధముగ మనతండ్రిచే ఎన్నియో సౌకర్యములు పొందుచున్నను, దుష్కృతుడు నిషిద్ధకర్మలు చేయుచునే యుండును. దుష్కృ



త్యములు చేయుచు, దండింపబడుచు నుండుట మూర్ఖము. అట్లే, ఈ మానవశరీరమును, కృష్ణుని తెలిసికొనుటకు ఉపయోగించనివాడు నరాధముడు. నిజమైన జనకుడగు కృష్ణునితో బాంధవ్యమును పునరుద్ధరించుటకు తన శరీరము నుపయోగింపనివాడు మానవశ్రేణినుండి పతితుడైనట్లు పరిగణింపవలెను.

పశువులు ఆహారము తిని, నిద్రించి, శరీరరక్షణ చేసికొనుచు, మైథునము చేయుచు చివరకు మరణించును. పశువులు ఉత్తమ చైతన్యమును ఉపయోగించుకొనజాలవు. అధమజాతి ప్రాణులయం దది సంభవింపదు. మానవుడుకూడ పశువులవలెనే ప్రవర్తించుచు తన చైతన్యమును ఉద్ధరించుకొనుటకు అవకాశము తీసికొననిచో, మానవపదవినుండి భ్రష్టుడై పునర్జన్మలో పశువుగా పుట్టును. కృష్ణుని దయవలన మనకు ఉన్నతశక్తిగల శరీరము, బుద్ధి లభించినవి. కాని, వానిని మనము ఉపయోగించుకొననిచో అతడు వాటిని మరల మనకు ఎందుకీయవలెను. అనేక లక్షల సంవత్సరముల పరిణామ ఫలముగా మనకీ మానవ దేహము ప్రాప్తించినది. ఎనుబది నాలుగు లక్షల జీవరాసులలో జీవించుచు పరిణమించుచు, పరిభ్రమించు ఈ జనన మరణ సంసార చక్రము నుండి విముక్తి పొందుటకు జీవికి ఈ శరీరము మంచి అవకాశమిచ్చును. ఈ అవకాశము కృష్ణకృపవలన కలిగినది. దానిని జారవిడిచినచో మనము నరాధములుగాక మరేమి ? ఏదియో విశ్వవిద్యాలయము నుండి ఎం. ఎ., పి. హెచ్ డి. పట్టములను సంపాదించినను, మాయాశక్తి ఈ లౌకిక విజ్ఞానమును అపహరించివేయును. నిజముగ తెలివిగలవాడు తానెవరో, దేవదేవుడెవరో, భౌతికప్రకృతి యెట్టిదో, ఇందులో తానెందులకు దుఃఖమును అనుభవించు చున్నాడో, ఆ దుఃఖనివారణకు ఉపాయమేదియో తెలిసికొనుటకు తన తెలివిని వినియోగించును.

ఇంద్రియ తృప్తికై మోటారు బండినో, దూరదర్శనినో; ఆకాశ

వాణి యంత్రమునో నిర్మించుటకు మన తెలివిని ఉపయోగింపవచ్చును. కాని, అది తెలివికాదని మనము గ్రహించవలెను. మరేమిటి? దొంగిలించి తెచ్చిన తెలివి. జీవితసమస్యలను అర్థము చేసికొనుటకు తెలివి ఇవ్వబడినదిగాని, అది అన్యథా వినియోగపడుచున్నది. జనులు మోటారు బండ్లు నిర్మించుట, వానిని నడపుట నేర్చి, అదే విద్య యనుకొనుచున్నారు. కాని, వాని నిర్మాణమునకు ముందుకూడ జనులు ప్రయాణము చేయుచునేయుండిరి. సౌకర్యము మాత్రము పెరిగినదిగాని, దానితో పాటు వాతావరణ కాలుష్యము, రోడ్లపై జనసమ్మర్దము మొదలగు సమస్యలు గూడ ఉత్పన్నమైనవి. అదే 'మాయ'. మనము సౌకర్యములు ఏర్పరచుకొనుచున్నాము: ఆ సౌకర్యములు సమస్యలను తెచ్చిపెట్టుచున్నవి!

ఇన్ని ఆధునిక సౌకర్యములను సృజించుకొనుటలో మన శక్తిని వ్యర్థము చేయుటకుమారు, దానిని మనమెవరో, ఏమిటో తెలిసికొనుటకు వినియోగింపవలెను. మనకు దుఃఖానుభవము ఇష్టములేదు గాన, దుఃఖమెందుకు మనపై బలవంతముగా వచ్చిపడుచున్నదో గ్రహింపవలెను గదా? విజ్ఞాన మనబడుదానితో అణుశక్తి మారణాస్త్రము నిర్మించుటలో మాత్రము త్వరితగతిని సాధించినాము. ఇది గొప్ప విజ్ఞాన ప్రగతియని గర్వపడుచున్నాము. కాని, మరణమును నివారించు నుపాయమును కనిపెట్టినచో విజ్ఞానములో మనము ముందడుగువేసినట్లే. భౌతికప్రకృతిలో మృత్యువు ఇంతకుముందే యున్నది. కాని, ఆ మృత్యువును ఒక్క అస్త్రప్రయోగముతో అందరినీ చంపుట మూలమున సాధించుటకు ఎంతో ఆసక్తితో ఉన్నాము. ఇదియే 'మాయయాఽపహృతజ్ఞానాః'- అనగా మాయచే అపహరింపబడిన జ్ఞానము కలవారని అర్థము.

అసురులును, రాక్షసులును సుప్రసిద్ధ నిరీశ్వరవాదులును వాస్తవమున దేవదేవునితో తలపడుదురు. జగజ్జనకుడే లేనిచో మనము జన్మించి



యుండెడివారమే కాదుగదా! ఆయనతో తలపడుటలో అర్థమేమున్నది? దేవతలు, అసురులు అని రెండువిధములుగా మానవులున్నారని వేదములలో ఉన్నది. దేవతలనగా ఎవరు? దేవదేవుని భక్తులును అతనివలె నగుదురు గాన వారిని దేవతలు అందురు. దేవదేవుని శాసనములను ధిక్కరించినవారిని అసురులని, రాక్షసులని అందురు. ఈ రెండు విధములవారు మానవ సంఘములో ఎల్లప్పుడు నుందురు.

కృష్ణప్రపత్తి చేయని దుష్కృతులు నాల్గువిధములుగా ఉన్నట్లు, ఆయనను పూజించు భాగ్యవంతులుగూడ నాల్గువిధములుగ నున్నారు. వారిని గురించి ఈ శ్లోకములో ఉన్నది:

*చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽర్జున*
*ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ*

"ఓ భరత వంశ శ్రేష్ఠుడవైన అర్జునా! ఆపదలో నున్నవాడు, సంపదగోరువాడు, జ్ఞానమును వాంఛించువాడు, పరమాత్మజ్ఞానము నన్వేషించువాడు – ఈ నాల్గురకములైన పుణ్యాత్ములును నాకు భక్తియుక్తమైన సేవచేయ దొడంగుదురు." (భ. గీ. 7. 16)

ఈ భౌతిక ప్రపంచము దుఃఖమయము. సజ్జనులు, దుర్జనులు, అందరును దానికి లోబడినవారే. చలికాలములో చలి అందరినీ బాధించును. వీడు సజ్జనుడు, వీడు దుర్జనుడు, ధనికుడు, పేదవాడు అను భేదము దానికిలేదు. కాని, సజ్జన దుర్జనభేదము ఎక్కడ ఉన్నదనగా, దుఃఖము కలిగినపుడు సజ్జనుడు దేవదేవుని స్మరించును. తరచుగా కష్టములో నున్నవాడు ప్రార్థనాలయమునకు పోయి ప్రార్థనలు చేయును. ఏమని? "ఓ దేవదేవా? నేను కష్టములోనున్నాను. దయచేసి నన్ను రక్షించు" అని. ఏదో లౌకిక సుఖముకొరకే అతడు ప్రార్థించుచున్నను అటువంటి వారుకూడ దుఃఖములో భగవంతుని విస్మరించలేదు గనుక సజ్జనులుగా భావింపబడవలెను. అట్లే, ఒక పేదవాడు చర్చికి పోయి

ఓ దేవా ! నాకు కొంత ధనమునిమ్ము" అని ప్రార్థించును. జిజ్ఞాసువులు అట్లుగాక తెలివిగలవారు, ప్రపంచమును అర్థము చేసికొనుటకు ప్రయత్నింతురు. "దేవుడనగా ఎవరు?" అని వారు ప్రశ్నించి సమాధానము కొరకు శాస్త్రీయపరిశోధనలు జరుపవచ్చు. పరిశోధనలు యోగ్యమైన విషయముగురించి చేయుచున్నారు, గాన వారు కూడ సుకృతులే. జ్ఞానము గలవానిని జ్ఞాని యందురు; అనగా తన స్వరూపస్థితిని ఎరిగిన వాడు. అటువంటి జ్ఞానికి దేవుడు నిర్గుణుడను భావము ఏర్పడవచ్చు. కాని, పరబ్రహ్మతత్త్వమును ఆశ్రయించిన వాడుగాన అతడుగూడ సుకృతిగా పరిగణింపబడవలెను. ఈ నాల్గు విధములవారు ఈశ్వర వాదులు గాబట్టి సుకృతు లనబడుదురు.

*తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే*
*ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః*

"వారిలో సంపూర్ణజ్ఞానము గలవాడును, సర్వదా విశుద్ధభక్తి యుక్త సేవలో నిమగ్నుడైనవాడును అత్యుత్తముడు. అతనికి నేను మిక్కలి ప్రియుడను ; అతడును నాకు ప్రియుడు." (భ. గీ. 7.17)

దేవదేవుని సన్నిధిలోనున్న ఆ నాలుగువిధముల మానవ వర్గములలో భగవత్స్వరూపమును తెలిసికొనుటకు శ్రద్ధాభక్తులతో ప్రయత్నించుచు కృష్ణచైతన్యప్రాప్తికై ప్రయత్నించువాడు 'విశిష్యతే' – యోగ్యతముడు. అట్టి వానికి భగవత్తత్త్వము తెలిసికొనుటతప్ప వేరుపని లేదు గాన, వాడు తన కత్యంత ప్రియుడని కృష్ణుడనెను. ఇతరులు తక్కువ వారు. ఎవరైనను ఏదైనను కావలసినచో దేవదేవుని ప్రార్థించ నవసరములేదు. అట్లెవరైనను చేసినచో, సర్వజ్ఞుడగు భగవంతుడు తన హృదయములోనే ఉన్నాడని వానికి తెలియదుగాన ప్రార్థనచేయుట మూర్ఖత్వము. తనకు కష్టము ఎప్పుడు వచ్చునో, డబ్బు ఎప్పుడు అవసరమో ఆయనకు తెలుసు. జ్ఞానికి ఈ విషయము తెలియును. అతడు



భౌతిక దుఃఖనివారణకు ప్రార్థింపడు. మరి ఏమి చేయును ? భగవంతుని దివ్యగుణములను కీర్తించుచు ఆయన మహిమను ఇతరులకు కూడ చెప్పును. స్వార్థము కొరకు, అన్న వస్త్రములకొరకు, ఇల్లు వాకిలికొరకు ప్రార్థింపడు, ఆపదలోనున్న సద్భక్తుడు "ప్రియమైన దేవదేవా ! ఇది నీదయ నన్ను బాగుచేయుటకొరకే నీవు నా కీకష్టమును కల్పించితివి. ఇంతకంటె పెద్దకష్టము నాకు దాపురించవలసినది. కాని, నామీది వాత్సల్యముచే నీవు దానిని తగ్గించినావు" అని ప్రార్థించును. నిశ్చలుడైన కేవలభక్తుని దృష్టి యిది.

కృష్ణచైతన్యము నందున్నవాడు భౌతిక దుఃఖములకు దూరముగానుండునుగాన దుఃఖములనుగాని, మానావమానములనుగాని లెక్కచేయడు. మానావమానములు, సుఖదుఃఖములు శరీర ధర్మములనియు, తాను శరీరము కాదని వానికి బాగుగ తెలియును. ఉదాహరణకు, సోక్రటీసు ఆత్మ నిత్యమని తెలిసినవాడు. ఆయనకు మరణశిక్ష విధింపబడినది – "నీవు ఏవిధముగ పాతిపెట్టబడవలెనని కోరుచున్నావు?" అని అడిగినందులకు ఆయన "మొదట మీరు నన్నుపట్టుకోవలెనుగదా!" అని సమాధానమిచ్చెను. కాబట్టి తాను శరీరము కాదు అని తెలిసినవానికి తన్ను ఎవరును పట్టుకొనుట, బాధించుట, చంపుట, పాతిపెట్టుట – అనునవి చేయజాలరని తెలియును గాన భయపడడు. కృష్ణచైతన్య విజ్ఞానపండితునికి తాను శరీరము కాదనియు, కృష్ణుని అంశమనియు, అదియే తనకును కృష్ణునికిని మధ్య నిజమైన బాంధవ్య మనియు, తా నీ భౌతిక కాయములో ప్రవేశించినను, భౌతిక ప్రకృతి యొక్క త్రిగుణములకు ఏదోవిధముగ దూరముగ నుండవలెననియు బాగుగ తెలియును. ప్రకాశ, ప్రవృత్తి, మోహములతో తనకు పనిలేదు, కృష్ణునిలోనే పని; ఇది గ్రహించినవాడు జ్ఞాని, బుద్ధిమంతుడు కృష్ణునికి పరమప్రియుడు. ఆప

దలో నున్నవానికి సంపద వచ్చినచో దేవుని మరచిపోవచ్చును. కాని, దేవునితత్త్వ మెరిగిన జ్ఞాని ఆయనను ఎన్నడును మరువడు.

జ్ఞానులలో నిరాకారవాదులవర్గ మొకటి ఉన్నది. నిరాకారుని ఆరాధించుట సాధ్యము కాదుగాన, భగవంతునికి ఒకరూపమున్నట్లు కల్పించుకొనవలె నందురు. వారు నిజమైన జ్ఞానులు కారు; మూర్ఖులు. భగవంతుని రూపమును ఎవరును ఊహింపలేరు. ఆయన మహత్త్వము సర్వాధికము. ఎవరైనను ఒక రూపమును ఊహించుకొని కల్పించుకొనవచ్చును గాని, అది అతని స్వీయకల్పన; అది నిజస్వరూపము కాదు. దేవునికి రూపము కల్పించువారు — దేవునకు రూపము లేదనువారు అను వీరిద్దరిలో ఎవడును జ్ఞాని కాడు. భారతదేశమున హిందూ ముస్లిం కలహములలో, ముస్లిములు హిందూ దేవాలయములను, హిందువులు మహమ్మదీయుల మసీదులను ధ్వంసము చేసి, మేము హిందూదేవుని చంపినాము; మేము ముస్లిం ఖుదాను చంపినాము అని అనుకొనెడివారు. అదేవిధముగ గాంధీ సత్యాగ్రహోద్యమము నడపుచున్నప్పుడు, చాలమంది భారతీయులు వీధులలోనికి పోయి తపాలా పెట్టెలను ధ్వంసముచేసి, ప్రభుత్వముయొక్క తపాలాశాఖను నాశనము చేసితి మనుకొనెడివారు. అటువంటి మనస్తత్త్వము గలవారు జ్ఞానులు కారు. హిందూముస్లిముల, మధ్య క్రైస్తవ క్రైస్తవేతరుల మధ్య జరిగిన మతయుద్ధములకు ఈ అజ్ఞానమే కారణము. జ్ఞానమున్నవానికి దేవుడొక్కడేయని తెలియును. అతడు హిందూ ముస్లిం క్రైస్తవులలో నెవడును కాడు.

భగవంతుడు ఈ విధముగ నుండును, ఆవిధముగ నుండును అనున దంతయును మనకల్పన, మన ఊహ. జ్ఞానికి భగవంతుడు అతీంద్రియుడని తెలియును. భౌతికగుణములకు భగవంతుడు అతీతుడని తెలిసినవాడు భగవంతుని నిజముగా నెరిగినవాడు. భగవంతుడు సదా మనప్రక్కనే, హృదయములలో ఉన్నాడు. మన మీ శరీరము



విడచినపుడు భగవంతుడు కూడ మనతో వచ్చును. మనము మరియొక దేహములో ప్రవేశించినపుడు మనతో ప్రవేశించి ఏమి చేయుదుమో చూచును. మన మతనికి ఎప్పు డున్ముఖులగుదము? దాని కొరకు అతడు సదా వేచియుండును. అతనికి ఉన్ముఖులమయిన వెంటనే రా, నాయనా రా, స చ మమ ప్రియః నీవు నాకు ఎల్లప్పుడును ప్రియుడవే. నీవిపుడు నావైపు తిరిగినావు గనుక నాకు చాల సంతోషము" అని పలుకును.

జ్ఞాని భగవద్విజ్ఞానశాస్త్రమును నిజముగా అవగాహనచేసికొనును 'భగవంతుడు మంచివాడు' అని మాత్రమే తెలిసికొన్నవాడు ప్రాథమిక దశలో నున్నవాడు. కాని, దేవదేవుడు నిజముగా నెంత గొప్పవాడో, ఎంతటి దయామయుడో తెలిసినవాడు మరికొంత పురోగతి సంపాదించును. ఆ జ్ఞానమును శ్రీమద్భాగవతము నుండి, భగవద్గీత నుండి పొందవచ్చును. భగవంతుని యందు నిజముగ ఆసక్తి యున్నవాడు భగవంతుని గురించి చెప్పు శాస్త్రమును — భగవద్గీతను చదువవలెను.

*ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే*
*జ్ఞానం విజ్ఞానసహితం యజ్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్*

"ప్రియమైన ఓ అర్జునా, నీవు నాయెడ ఎప్పుడును అసూయకలవాడవు కావు, కావున నీకు అనుభవ సహితమగు ఈ గూఢతమ జ్ఞానమును తెలుపుదును. దీనిని తెలిసికొని నీవు భౌతిక జీవిత క్లేశములనుండి ముక్తుడవు కాగలవు" (భ. గీ. 9.1)

భగవద్గీతలో ఉపదేశింపబడిన తత్త్వజ్ఞానము బహుసూక్ష్మమై అందరికిని చెప్పగూడని రహస్యమునై యున్నది. అది తత్త్వజానమయము, శాస్త్రగోచరమైన విజ్ఞానము. మనోవాచామగోచరము కూడ. దాని నెట్లు తెలిసికొనుట? భగవంతుడు స్వయముగాగాని, యోగ్యుడగు

గురువు ద్వారాగాని దానిని ఉపదేశించును. కావున భగవద్విజ్ఞాన విషయములో అభిప్రాయభేదములు, అపార్థములు సంభవించినపుడెల్ల తాను అవతరించెనని కృష్ణుడు చెప్పినాడు.

జ్ఞానము సహజాభిరుచులవలన రాదు. భక్తి కేవల మొక అభిరుచి కాదు. అది యొక శాస్త్రము. శ్రీల రూపగోస్వామి ఇట్లనిరి :– "వైదిక విజ్ఞాన సంబంధములేని ఆధ్యాత్మికత్వ ప్రదర్శనము సంఘశాంతి భంగకరము." తర్కయుక్తి జ్ఞానములతో భక్తిరసామృతాస్వాదనము చేసి, ఇతరులకు దానిని అందింపవలెను. కృష్ణ చైతన్యము కేవలము ఒక అభిరుచి విశేషమని భావింపరాదు. ఆ సంకీర్తన నృత్యములన్నియు శాస్త్రోక్తమయినవి. దానిలో శాస్త్రమున్నది. పరస్పర ప్రేమప్రదర్శన మున్నది. కృష్ణుడు జ్ఞానికి అత్యంతప్రియుడు, జ్ఞాని ఆయనకు ప్రియుడు. కృష్ణుడు మనప్రేమకు వేయిరెట్లు ప్రతిఫలమిచ్చుచు అత్యంత స్వల్పజీవులమగు మనకు కృష్ణుని ప్రేమించుట కేమి సామర్థ్యమున్నది? కాని, మనలను ప్రేమించుటకు కృష్ణునికి అపరిమిత శక్తియున్నది.

# 5. దేవదేవునికి ఉన్ముఖముగ

*ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,*
*ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్*

"ఈ భక్తులందరును నిస్సంశయముగా ఉదాత్తులైన వారే కాని నా జ్ఞానముతో కూడియున్నవానిని నేను నన్ను వలెనే భావింతును. అతడు దివ్యమైన నా సేవ యందు నిమగ్నుడగుటచే అత్యుత్తమ గమ్యమైన నన్ను తప్పక చేరును." (భ. గీ. 7.18)

ఇక్కడ, ఆర్తుడుగా గాని, ధనార్థిగా గాని, జిజ్ఞాసువుగా గాని, తనవద్దకు వచ్చు ప్రతివానికిని స్వాగతము, కాని, జ్ఞానిమాత్రము తనకు అత్యంత ప్రియుడు – అసుచున్నాడు కృష్ణుడు. తక్కిన వారికి కూడ స్వాగతమే. అనగా, ఈ భక్తిమార్గముననే నడువగా, జ్ఞానితో సమానులయ్యెదరని అభిప్రాయము. అయినను సాధారణముగా ఏదో లాభము కొరకు గుడికి వెళ్ళి ప్రార్థించి కోరిన ధనము లభించనిచో, దేవుని ప్రార్థించుట మూర్ఖమని భావించి గుడికి వెళ్ళుటయే మానివేయుదురు. క్షుద్రవాంఛలతో భగవంతుని సమీపించుటలో ఉన్న అపాయ మదే. ఉదాహరణకు ద్వితీయ ప్రపంచ మహాయుద్ధములో జర్మనీ సైనికుల భార్యలు పెక్కుమంది తమ భర్తలు క్షేమముగా తిరిగి రావలెనని ప్రార్థించుటకు చర్చికి వెళ్ళిరట. కాని, తమ భర్తలు యుద్ధములో మరణించుట చూచి, వారు నాస్తికులై పోయిరట. ఈ విధముగా భగవంతుడు మనకు కావలసినవి తెచ్చి యిచ్చు నౌకరుగా నుండవలెనని అనుకొని, ఆయన మన మడిగినది ఇవ్వనందున ఆయన లేడు అందుము. భౌతిక పిషయములకొరకు ప్రార్థించుటలో ఆ ప్రమాద మున్నది.

ఈ సందర్భమున ధ్రువుడను చిన్నబాలుని కథను పేర్కొన వచ్చును. రాజకుటుంబములో పుట్టిన ధ్రువుడను అయిదేండ్ల బాలుడుండెను. కొంతకాలమునకు అతని తండ్రి యగు రాజు ధ్రువునితల్లిని రాణిపదవి నుండి తొలగించి మరియొక భార్యను రాణిగా చేసికొనెను. ఆమె ధ్రువునికి సవతి తల్లి యాయెను. ఆమెకు అతనియెడల ఈర్ష్యగా నుండెడిది. ఒకనాడు ధ్రువుడు తన తండ్రి తొడమీద కూర్చుండగా, ఆమె వానిని అవమానించెను. 'నీవు నా పుత్రుడవు కావు. నీకు రాజుగారి ఒడిలో కూర్చుండు యోగ్యత లేదు' అని ఆమె అతనిని ఇవతలకు లాగివేసెను. ధ్రువునికి కోపము వచ్చెను. అతడు క్షత్రియుని కుమారుడు. క్షత్రియులకు శీఘ్రకోపము స్వాభావికము. ధ్రువునికి అది యొక పెద్ద అవమానముగా తోచి పూర్వము రాణిగా నుండిన తన తల్లి వద్దకు వెళ్ళి,

'అమ్మా నా సవతితల్లి నాన్నగారి ఒడిలో నుండి నన్ను లాగివేసి, అవమానించినది' అనెను.

'నాయనా ! నేనేమి చేయగలను ? నే నసహాయురాలను. మీ తండ్రికి నామీద ప్రేమలేదు,' అని ఆమె అనెను.

'సరే. దీనికి ప్రతీకార మెట్లు చేయుదును ?'

'నాయనా ! నీ వేమియును చేయలేవు. భగవంతుడు సహాయము చేసినచో నీవు పగతీర్చుకొన గలవు.'

'అటులనా ! భగవంతుడెక్కడున్నాడు ?' ధ్రువుడు ఉత్సాహముతో అడిగెను.

'పలువురు ఋషులు, మునులు భగవంతుని దర్శనము సంపాదించుటకు అరణ్యములకు వెళ్ళుదురని చెప్పుదురు. అక్కడ వారు భగవంతుని దర్శించుటకు తపస్సు చేయుదురు,' అని తల్లి ప్రత్యుత్తరమిచ్చెను.



వెంటనే, ధ్రువుడు అరణ్యమునకేగి, ప్రతిపులిని, ఏనుగును "ఓయీ! నీవేనా భగవంతుడవు ? నీ వేనా భగవంతుడవు ?" అని అడుగుట ప్రారంభించెను. ఆ విధముగ మృగముల నన్నిటిని అడుగుచుండెను. ధ్రువుని ఉత్సాహమును, జిజ్ఞాసను చూచి, కృష్ణుడు నారదుని ధ్రువుని విషయము కనుగొని రమ్మని పంపెను. నారదుడు వెంటనే అరణ్యమునకు వెళ్ళి ధ్రువుని చూచెను.

'వత్సా! నీవు రాజకుటుంబములో జన్మించిన వాడవు. ఈ కఠిన తపశ్చర్యను నీవు సహింపలేవు. ఇంటికి వెళ్ళి పొమ్ము. నీ తల్లిదండ్రులు నీకొరకు బెంగపడి యుందురు." అని నారదుడు అతనికి హితవు చెప్పెను.

'నన్ను ఈ మార్గము నుండి తప్పించుటకు ప్రయత్నింపకుడు. భగవంతుని గురించి మీకు తెలిసినను, ఆయనను నేను చూచుట యెట్లు సాధ్యమగునో తెలిసినను చెప్పుడు. లేనిచో నాకు శాంతిభంగము చేయకుడు. వెళ్ళిపొండు' అని ధ్రువుడనెను.

నారదుడు ధ్రువుని నిశ్చయము అచంచలమని గ్రహించి అతనిని తన శిష్యునిగా స్వీకరించి, *'ఓం నమో భగవతే వాసుదేవాయ'* అను మంత్రము నుపదేశించెను. ధ్రువు డా మంత్రమును జపించి, సిద్ధుడయ్యెను. భగవంతు డతనికి ప్రత్యక్షమయ్యెను.

"ప్రియకుమారా ! ధ్రువా ! నీ కేమి కావలెను ? ఏది కావలెనన్నను నేను నీకిచ్చెదను."

ధ్రువుడిట్లనెను – 'ఓ దేవా ! నా తండ్రియొక్క రాజ్యము కొరకే నే నీ కఠోర తపస్సులను చేయుచుంటిని, కాని నీ దర్శనమైనది. మహర్షులు, మునులు కూడ నిన్ను గాంచలేరు. నాకు లాభమేమి ? నేను ఇంటి నుండి బయలుదేరినది కొన్ని గాజుపెంకులు, చెత్త సంపా

దించుట కొరకే. దానికి మారు నా కిప్పుడు అత్యంతామూల్యమైన వజ్రము దొరికినది. నాకిప్పుడు తృప్తి కలిగినది. నిన్ను కోరవలసిన దేదియును లేదు.'

అదేవిధముగ ఎవరైనను దరిద్రముతో బాధపడుచున్నను లేక ఇంకొక దుఃఖములోనున్నను, ధ్రువునివలె దృఢ నిశ్చయముతో భగవంతుని చూడవలెను. ఆయన అనుగ్రహమును పొందవలెను అను పట్టుదలతో వెళ్ళి భగవంతుని చూచుట సంభవించినచో, ఇక ఏ మాత్రమును భౌతిక వస్తువును కోరడు. భౌతిక ధనార్జనము మూఢత్వమని తెలిసికొని, మాయను ప్రక్కకు త్రోసి, సత్యమునే కోరుకొనును. ధ్రువ మహారాజువలె కృష్ణచైతన్యములో నివసించువారు పూర్తిగా తృప్తులై ఇంకేమియు కోరరు.

భౌతిక విషయములు చంచలములని జ్ఞానికి తెలియును. తాను చేసినదానికి ప్రతిఫలము కోరుట, తన ఐశ్వర్యమును చూచి ఇతరులు మెచ్చుకొనవలె ననుకొనుట, తన ధనమునుబట్టి కీర్తి రావలెనని కోరుట_ ఈ మూడు వైఖరులలో ప్రతి భౌతిక విషయప్రాప్తి సంక్లిష్టమై యుండునని కూడ జ్ఞానికి తెలియును. ఏది ఎట్లయినను ఇవి యన్నియును దేహమున్నప్పుడే అన్వయించునవి గాన దేహపతనముతో అవికూడ పోవునని అతనికి తెలియును. శరీరము మరణించినపుడు, ఆ వ్యక్తి ఇక భాగ్యవంతుడు కాడు. కేవలము జీవాత్మగా ఉండి తన కర్మల ప్రకారము దేహాంతరమున ప్రవేశించును. జ్ఞాని దానిని చూచి భయపడదని గీత చెప్పుచున్నది. వానికి ఏది యెటువంటిదో తెలియును కాబట్టి లౌకిక ధనము కొరకు తానెందుకు విచారింపవలెను ? అతని వైఖరి యిట్లుండును. "దేవదేవుడైన కృష్ణునితో నాకు శాశ్వతసంబంధమున్నది ఇక ఆ సంబంధమును దృఢపరచుకొన్నచో కృష్ణుడు నన్ను తన రాజ్యములో స్వీకరింపగలడు."



విశ్వస్థితి కృష్ణునితో ఇట్టి సంబంధమును ఏర్పరచుకొని, దేవదేవత్వ పునఃప్రాప్తికై ప్రయత్నించుటకు అన్ని సౌకర్యములను కల్పించుచున్నది. ఇది జీవితములో మనధ్యేయమై యుండవలెను. మనకు కావలసిన ప్రతివస్తువును భూమి, ధాన్యము, ఫలములు, పాలు, ఇల్లు, వస్త్రములు_ భగవంతు డిచ్చుచున్నాడు. మనము కేవలము శాంతముగా జీవించుచు కృష్ణ చైతన్యమును పెంపొందించుకొనవలెను. అది జీవితములో మన పురుషార్థమై యుండవలయును. కాబట్టి ఆహార, గృహ, రక్షణ, కామ రూపములలో దేవదేవుడు మనకిచ్చిన దానితో తృప్తిపడి, ఇంకను ఇంకను ఎక్కువ కావలెనని కోరుకొనగూడదు. నిష్కపట నిరాడంబర జీవనము, అత్యున్నతములైన ఆలోచనలు _ ఇవి ఉత్తమ సభ్యతాలక్షణములు. ఆహారమైథునములు కర్మాగారములలో ఉత్పత్తియగు వస్తువులు కావు. అవియును తెలిసి, ఇంకను మనకు కావలసినవియు భగవంతుడే యిచ్చుచున్నాడు. వానిని బాగుగా ఉపయోగించుకొని, భగవచ్చైతన్యవంతుల మగుట మనకర్తవ్యము.

భూతలమున శాంతముగ జీవించుటకును, కృష్ణచైతన్యము పెంపొందించుటకును, చివరకు ఆయనను చేరుటకును అన్ని సౌకర్యములు భగవంతుడు మనకు కల్పించినను ఈ యుగమున మనము దురదృష్టవంతులము. మనము అల్పాయుష్కులము. ఇల్లు, తిండి, గుడ్డ, గార్హస్థ్యము లేక ప్రకృతి ప్రమాదములనుండి రక్షణ లేనివారు చాలమంది యున్నారు. ఇది ఈ కలియుగ ప్రభావము. ఇట్టి భయంకరస్థితిని గమనించియే ఆధ్యాత్మిక జీవితమును పెంపొందించుకొనుట అత్యవసరమని చైతన్య మహాప్రభువు చెప్పెను. మరి దానిని చేయుట యెట్లు ? చైతన్య ప్రభువు దానికి సూత్రము చెప్పెను :

*హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలమ్*
*కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా*

"ఊరక హరేకృష్ణయని నిరంతరము కీర్తింపుము." నీవు కర్మాగారములో నున్నను, నరకములోనున్నను, గుడిసెలోనున్నను అంబరచుంబి ప్రాసాదములోనున్నను లెక్కచేయవలదు. ఊరకనే హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే, హరే రామ హరే రామ రామ రామ హరే హరే అని జపించుచునే యుండుము. దానికి ఖర్చులేదు. అడ్డము లేదు వర్ణము లేదు. మతము లేదు. శరీరచ్ఛాయ లేదు. ఎవరైనను దానిని చేయవచ్చును. కేవలము కీర్తింపుము వినుము.

ఏదో విధముగ ఎవడైనను కృష్ణచైతన్య సంపర్కము కలిగి, యోగ్యుడైన గురువు చెప్పినట్లు నడచుకొన్నచో వాడు భగవంతుని వచ్చిచేరుట తథ్యము.

బహూనాం జన్మనా మన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః

"సంపూర్ణ జ్ఞానము కలవాడు నేను కారణముల కన్నిటికిని కారణమనియు సమస్తమనియు ఎరింగి పెక్కు జననమరణముల తర్వాత నన్ను శరణుజొచ్చును. అట్టి మహాత్ముడు చాల అరుదు." (భ. గీ. 7. 19)

భగవంతుని తెలుపుశాస్త్రములో ఆధ్యాత్మిక పరిశోధనలు అనేక జన్మలలో చేయవలసియుండును భగవదనుభూతి చాల తేలికయే కాని, చాల కష్టసాధ్యముకూడ. కృష్ణుని వాక్కులను సత్యముగా తీసికొను వారికి భగవదనుభూతి తేలిక. కాని, పరిశోధనద్వారా తెలిసికొనుటకు ప్రయత్నించువారు జ్ఞానాభివృద్ధిచేత ఎంతో పరిశోధనచేసి తమ విశ్వాసమును స్థాపించుకొనవలసి యుండును. ఈ పద్ధతిలో చాల జన్మలు పట్టును. దివ్యానుభూతిని పొందిన, పరమతత్త్వమును తెలిసికొన్న తత్త్వవేత్తలలో చాల భేదములున్నవి. ఈ తత్త్వవేత్తలు పరమార్థములో ద్వైతము లేదనుచున్నారు. పూర్ణతత్త్వమున ద్వైతము లేదు. అన్ని



యును నమస్థాయిలోనే యుండును. పరమార్థ తత్త్వమును గ్రహించిన వాడు తత్త్వవేత్త యనబడును.

పరమాత్మ తత్త్వము బ్రహ్మమని, పరమాత్మయని, భగవంతుదని మూడు వైఖరులు కలిగి యున్నదని కృష్ణుడు చాటెను. మొదటిది నిరాకారబ్రహ్మ మహాతేజము, రెండవది స్థానికుడైన పరమాత్మ, మూడవది దేవదేవత్వము. ఈ విధముగా పరమార్థసత్యమును మూడువైపుల నుండి ఎవరైనను చూడవచ్చును. ఒక పర్వతమును దూరమునుండి చూచిన ఒక విధముగా నుండును. దగ్గరకువచ్చి చూచినచో దానిమీద నున్న చెట్లు చేమలు కనబడును. ఎక్కినచో ఆ వృక్షాదులలోను, జంతువులలోను ఇంకను ఎన్నో విశేషములు కనబడును. దృశ్యవిషయము ఒకే వస్తువు. ఋషులు అనేక దృక్కోణములనుండి పరతత్త్వమును దర్శించి అనేక విధములుగా వర్ణించిరి. మరియొక ఉదాహరణము. ఎండ, సూర్యబింబము, సూర్యభగవానుడు – ఉన్నారు. ఎండలో నిలబడుటవలన సూర్యునిలో నిలబడినట్లుకాదు. సూర్యునిమీదనే యున్నవాడు ఇతరుల దృక్కోణమునుండి అంతకంటె మంచిస్థితిలో ఉన్నాడని చెప్పవలెను. సర్వవ్యాప్తమైన బ్రహ్మజ్యోతి ప్రకాశమునకు ఎండను పోల్చవచ్చును. స్థానిక సూర్యబింబము జీవాత్మ సూర్యబింబములో నుండు సూర్యదేవతను దేవదేవునితో పోల్చవచ్చును. ఈభూలోకములో నానావిధ ప్రాణులున్నట్లు వేదసాహిత్యమునుబట్టి సూర్యలోకములో గూడ అనేక ప్రాణు లున్నవనియు, కాని, భూలోక జీవులశరీరములు మృణ్మయములైనట్లు సూర్యలోక జీవుల దేహములు అగ్నిమయములనియు తెలియుచున్నది.

భౌతిక ప్రకృతిలో అయిదు మహాభూతము లున్నవి – 'పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము. ఈ భూతములలో ఒక్కొక్క దాని ప్రాధాన్యమును బట్టి విభిన్నగ్రహములలో విభిన్న వాతావరణ

ములు ఏర్పడును. ఆయా గ్రహములలో ఆయా భూతముల ప్రాధాన్యమును బట్టి అక్కడి ప్రాణుల శరీరములలోను భేదము లుండును. గ్రహములన్నిటిమీద ప్రాణుల శరీరములు ఒకే విధముగనుండు ననుకొనరాదు. కాని, ఏదో రూపములో ప్రతిశరీరములోను పంచభూతము లుండు ననునది సమానము. ఈ విధముగ కొన్నిగ్రహములలో పృథివి ప్రధానము, జలము ప్రధానము, అగ్ని ప్రధానము, వాయువు ప్రధానము, ఆకాశము ప్రధానముగా నుండును. కాబట్టి ఒక గ్రహములో పృథివి ప్రధానము కానందున మన వాతావరణమువంటిది అక్కడ లేనందున ప్రాణులు, లేవనుకొనుట పొరపాటు. నానావిధ ప్రాణిశరీరములుగల గ్రహములు లెక్కకు మిక్కిలిగా ఉన్నవని వేదసాహిత్యము చెప్పుచున్నది. మనము భౌతికమగు మార్పులు కొన్ని చేసికొని అనేకవిధ భౌతిక గ్రహలోకములలో ప్రవేశించుటకు సామర్థ్యమును కల్పించుకొన్నట్లు కొన్ని మార్పులతో దేవదేవుడు నివసించు ఆధ్యాత్మిక లోకమున ప్రవేశించగలము.

*యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః*
*భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపి మామ్*

"దేవతలను పూజించువారు దేవతలలో జన్మింతురు. పితృ దేవతలను పూజించువారు పితృలోకములకు పోవుదురు. భూత పిశాచములను పూజించువారు అట్టివారియందే జన్మింతురు. నన్ను పూజించువారు నాతోనే నివసింతురు." (భ. గీ. 9.25)

ఊర్ధ్వలోకములకు వెళ్ళగోరినవారు అక్కడకు వెళ్ళవచ్చును. కృష్ణలోకమగు గోలోక బృందావన ప్రవేశమునకు యోగ్యత సంపాదింప ప్రయత్నించువారు కృష్ణచైతన్యము ద్వారా దానియందు ప్రవేశింపవచ్చును. భారత దేశమునకు వెళ్ళుటకుముందు ఆ దేశ మెట్లుండునో దాని వర్ణనము వినగోరుదుము. శ్రవణము మొట్టమొదటి అనుభవము.



అదే విధముగ దేవదేవు డెక్కడ నివసించునో ఆలోకమును గురించి విశేషములు తెలియగోరినచో, మనము మొదట వినవలెను. వెంటనే ప్రయోగము చేసిచూచి అక్కడికి వెళ్ళలేము. అది సాధ్యము కాదు. కాని, వేదసాహిత్యమున పరమాత్మ లోకమును గురించి అనేక వర్ణనలున్నవి. ఉదాహరణమునకు – బ్రహ్మసంహితలో ఇట్లు ఉన్నది:

*చిన్తామణి ప్రకర సద్మసు కల్పవృక్ష లక్షావృతేషు సురభీరభిపాలయన్తమ్*
*లక్ష్మీసహస్రశత సమ్భ్రమ సేవ్యమానం గోవిన్ద మాదిపురుషం తమహం భజామి.*

"ఆదిదేవుడును, మూలపురుషుడును, గోపాలుడును, సర్వకామితముల నిచ్చువాడును, లక్షలకొలది కల్పవృక్షముల మధ్య నున్న చింతామణి సమూహములతో నిర్మించబడిన గృహములం దుండువాడును, కోట్లకొలది లక్ష్మీదేవులచేత, గోపికలచేత భక్తి గౌరవ పూర్వకముగా సేవింపబడువాడును అగు గోవిందుని పూజింతును." ఇంకను సవిస్తరములగు వర్ణనలు ప్రత్యేకముగా బ్రహ్మసంహితలో ఇయ్యబడినవి.

పరమార్థ తత్త్వమును తెలియ ప్రయత్నించు వారిని–వారు ఏకాగ్రముగ ధ్యానించు పరతత్త్వ రూపమును బట్టి దృక్కోణమును బట్టి వర్గీకరించిరి. నిరాకార బ్రహ్మము మీద మనస్సును ఏకాగ్రము చేయువారు బ్రహ్మవాదులు, నిర్గుణోపాసకులు. సాధారణముగ పరమతత్త్వమును తెలియు గోరువారు మొదట బ్రహ్మజ్యోతిని తెలిసికొందురు. హృదయములో స్థానికముగ నుండు పరమాత్మను ధ్యానము చేయువారు పరమాత్మవాదులు. దేవదేవుడు తన పూర్ణాంశరూపములో ప్రతి వారి హృదయము నందుసు ఆసీనుడై యున్నాడు. ధ్యానము చేతను ఏకాగ్రత ఆ రూపమును చూడవచ్చును. ఆయన ప్రతి హృదయములోనే కాక, సృష్టిలోని ప్రతి అణువు నందును కలడు. ఈ పరమాత్మ దర్శనము

రెండవదశ. దేవదేవుడగు భగవంతుని సాక్షాత్కారము మూడవదశ. ఈ విధముగా మూడు దశలున్నందున పరతత్త్వసాక్షాత్కారము ఒక్క జన్మలో కాదు. 'బహూనాం జన్మనా మన్తే' అదృష్టవంతుడౌటకు ఒక క్షణములో కావచ్చునుగాని, పరతత్త్వము తెలియుటకు అనేక సంవత్సరములు, అనేక జన్మలు పట్టును.

అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః

"సర్వములైన ఆధ్యాత్మిక భౌతిక ప్రపంచములకును నేనే కారణభూతుడను. సర్వము నానుండియే పుట్టును ఇది పూర్తిగ నెరింగిన పండితులు భక్తియుక్తమైన నా సేవలో నిమగ్నులై హృదయ పూర్వకముగ నన్ను పూజింతురు." (భ. గీ. 10.8)

వేని నుండి ఈ విశ్వమంతయు జనించునో అతడు బ్రహ్మమని వేదాంత సూత్రములు కూడ ధ్రువపరచుచున్నవి. కృష్ణుడే జగత్కారణమని నిజముగా నమ్మి పూజించినచో మనకథ యంతయు క్షణములో ముగిసినట్లే. కాని, దీనిని నమ్మక "నేను దేవుడు ఎట్లుండునో చూడగోరుచున్నాను." అనువాడు దశల వారీగా మొదట నిరాకార బ్రహ్మజ్యోతిని తెలిసికొని, తరువాత స్థానిక పరమాత్మను తెలిసికొని, చివరకు అంతిమ దశకు వచ్చి "ఆహా! దేవదేవుడు ఇక్కడ ఉన్నాడు" అని తెలిసికొనవలసి యుండును. కాని, ఈ క్రమమునకు ఎక్కువ కాలము పట్టునని చెప్పవలెను. అనేక సంవత్సరములు పరిశోధించి పరబ్రహ్మమును తెలిసికొన్నవాడు అనేక సంవత్సరముల పిదప "వాసుదేవస్సర్వం"- అంతయును వాసుదేవుడే యని గ్రహించును. వాసుదేవుడు అనునది కృష్ణుని పేరు. దానికి సర్వత్ర నివసించువాడు అని అర్థము. వాసుదేవుడు జగత్కారణమని తెలిసినవాడు "మాం ప్రపద్యతే"



ఆత్మ సమర్పణము అనగా 'ప్రపత్తి' చేసికొనును. ఈ ప్రపత్తి మార్గమే పరమపురుషార్థము. దీనిని వెంటనే చేయవచ్చు. లేదా అనేక జన్మల పరిశోధనము తర్వాత చేయవచ్చు. ఎట్లైనను దేవదేవుడు సర్వాధికుడు, నేను ఆయన భృత్యుడను అని శరణు జొచ్చుట తప్పదు.

ఇది గ్రహించి జ్ఞాని వెంటనే శరణు జొచ్చును. గాని అనేక జన్మల వరకు వేచియుండడు. జీవుల యెడ ఆయన కున్న అపారప్రేమ వశమున ప్రపత్తి మార్గమును దేవదేవుడు మనకు తెలియజేసెనని జ్ఞానికి తెలియును. భౌతిక ప్రపంచమున కలుగు మూడు విధములగు దుఃఖములను బద్ధజీవులమగు మనము అనుభవించుచున్నాము. దేవదేవుడు ప్రపత్తి మార్గము ద్వారా ఈ మూడు దుఃఖముల నుండి తప్పించుకొనుటకు మనకు అవకాశ మిచ్చుచున్నాడు.

ఇక్కడ ఒక ప్రశ్న ఉదయించును : దేవదేవుడే మనకు పరమగమ్యస్థానమై ఆయనకు ప్రపత్తి చేయవలసియుండగా, ప్రపంచములో ఇన్ని విధములైన పూజా విధానములు ఎందుకున్నవి? దీనికి జవాబు ఈ శ్లోకములో నున్నది :

కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా

"భౌతిక వాంఛలచే అపహరింపబడిన జ్ఞానముకలవారు దేవతలను శరణు జొచ్చి తమ సహజ ప్రకృతులను బట్టి ప్రత్యేక పూజానియమ నిబంధనలను అనుసరింతురు." (భ. గీ. 7.20)

ప్రపంచములో మానవులు నానా విధములుగ నుందురు. వారు నానావిధ భౌతిక స్వభావములకు లోబడి ప్రవర్తించుదురు. సాధారణముగ ఎక్కువమందికి మోక్ష మక్కరలేదు. యోగశక్తిని సంపాదించి లాభము గడించు ఉద్దేశముతో వారు ఆధ్యాత్మిక మార్గమున ప్రవేశింతురు. భారతదేశములో ఒక సన్న్యాసి వద్దకు పోయి "స్వామీ, నేను వ్యాధిలో

బాధపడుచున్నాను. ఔషధ మేదైనా ఇవ్వగలరా ?" అని ఎవరైనను అడుగుట సర్వసాధారణము. "డాక్టరు డబ్బడుగునుగాన అద్భుతములు చేయగల ఒకస్వామి వద్దకు పోవుదము." అని అనుకొందురు. భారతదేశమున "నీవు ఒక ఔన్సు బంగారము ఇచ్చినచో, నేను వందఔన్సుల బంగారము చేయగలను" అని చెప్పు స్వాములు కూడ ఉన్నారు. జనులు "నావద్ద అయిదు ఔన్సుల బంగారమున్నది. దానిని అయిదు వందల ఔన్సుల బంగారము చేసికొనగలను." అనుకొందురు. ఈ విధముగ ఆ 'స్వామి' గ్రామములో నున్న బంగారమంతయు ప్రోగుచేసి, తర్వాత మాయమైపోవును. ఇది మన జబ్బు. ఒక "స్వామి" వద్దకో, దేవాలయమునకో, చర్చికో వెళ్ళినపుడు విషయవాంఛలతో నిండి వెళ్లుదుము. ఆధ్యాత్మిక జీవితము నుండి భౌతిక లాభములు పొందుటకు, యోగాభ్యాసము కేవల మారోగ్యము కొరకు చేయుదుము. నిత్యవ్యాయామము చేతను, పథ్యాహారము చేతను మన ఆరోగ్యమును కాపాడుకొనవచ్చును. ఆరోగ్యము కొరకు యోగాభ్యాస మెందుకు ? ఎందుకనగా, 'కామైస్తైస్తైర్హృతజ్ఞానాః' మనము ఆరోగ్యమును కాపాడుకొని జీవితభోగముల ననుభవింప వలెనను భౌతికవాంఛతోను భగవంతుని మన వాంఛలు పూరించువానిగా చేయు వాంఛతోను దేవాలయమునకో, చర్చికో వెళ్ళుచున్నాము.

భౌతిక కామనలు గలిగినవారు అనేక దేవతలను పూజింతురు. ప్రకృతి నుండి విముక్తులగు భావమే వారికి లేదు. వారు సాధ్యమైనంత ఎక్కువ లాభమును పొందుటకు ఈ భౌతిక ప్రపంచమును వినియోగింప గోరుదురు. ఉదాహరణకు ; వేదవాఙ్మయమున అనేకమగు ఉపదేశములున్నవి : ఆరోగ్యమునకు సూర్యుని అరాధింపవలెను. ఒక కన్యకు మంచి భర్త రావలెనన్న శివుని పూజింపవలెను. సౌందర్యమునకు మరియొక దేవతను, విద్యకు సరస్వతీదేవిని పూజింపవలెను. ఈ



విధముగా, పాశ్చాత్యులకు హిందువులు అనేక దేవతలను పూజించువారుగా కనబడుదురు. కాని, నిజమునకు, ఈ ఉపాసనలు దేవదేవునికి కాదు ; దేవతలకు మాత్రమే. దేవతలు దేవదేవుడని భావింపరాదు. దేవుడు ఒకడే. కాని, మన వలెనే దేవతలు కూడ జీవాత్మలే. భేదమేమన వారికి శక్తులెక్కువ. భూలోకమున రాజుగాని, అధ్యక్షుడుగాని, నియంతగాని ఉండవచ్చును. వారందరును మన వంటి మనుష్యులే, కాని, వారి శక్తులు అసాధారణములు, వారి అనుగ్రహము సంపాదించుటకు, వారి శక్తులను ఉపయోగించుకొనుటకు వారిని మనము ఏదో విధముగ పూజింతుము. కాని, భగవద్గీత అన్యదేవతోపాసనను ఖండించుచున్నది. ఈ శ్లోకము కేవలము కామముకొరకే దేవతలను మానవులు పూజింతురని స్పష్టముగా చెప్పుచున్నది.

ఈ భౌతిక జీవితము కేవలము కామము నాశ్రయించి యున్నది. మనము ఈ ప్రపంచసుఖ మనుభవింపగోరు చున్నాము. మన ఇంద్రియములను తృప్తి పరచుకొనుటకు మనము భౌతికప్రపంచమును ప్రేమించుచున్నాము. ఈ భౌతిక విషయప్రేమ దేవదేవుని యెడ మన ప్రేమకు విపరీతరూపము. మన మూలస్వరూపమునుబట్టి దేవదేవుని ప్రేమించుటకు మనము సృజింపబడినాము. కాని, దేవదేవుని మరచి ప్రకృతిని ప్రేమించుచున్నాము. ప్రేమ అనునది ఉండనే ఉన్నది. ప్రకృతినైనను ప్రేమింతుము. దేవదేవునినైన ప్రేమింతుము, కాని, ఎట్టిపరిస్థితులలోను ప్రేమయను సహజ ప్రవృత్తినుండి తప్పించుకొనలేము. సంతానములేనివారు కొందరు కుక్కనో, పిల్లినో పెంచుకొనుట మనము తరచు చూచుచున్నాము. ఏలన, దేనినో ఒకదానిని ప్రేమింపగోరుదుము. వాస్తవమైనది లేనప్పుడు, మన ప్రేమవిశ్వాసాలను కుక్కలమీదనో, పిల్లుల మీదనో కనబరచెదము. ప్రేమ యెల్లప్పుడును ఉన్నది. అది కామముగా వికృతరూపమైనది. ఈ కామమునకు భంగము కలిగినచో, క్రోధముగా

మారును. కోపములో మనకు సమ్మోహము కలుగును. సమ్మోహము వలన నాశము కలుగును. ఇప్పుడు జరుగుచున్నది ఇది. కాని, ఈ మార్గమును మరలించి కామమును ప్రేమగా మార్చవలెను. మనము భగవంతుని ప్రేమించినయెడల సర్వమును ప్రేమింతుము. భగవంతుని ప్రేమించనిచో ఇక యే యితరమునైనను ప్రేమించుట సాధ్యముకాదు. దానిని ప్రేమయని మనము భావింపవచ్చునుగాని, అది కామవాంఛకు మరొక ఆకర్షణీయమైన రూపము. కుక్కలవలె విషయలోలురైనవారు సర్వజ్ఞాన విమూఢులనబడురు: "కామైస్తైస్తైర్హృతజ్ఞానాః."

అన్యదేవతల ఉపాసనలకు అనేక నియమ నిబంధనములు శాస్త్రములలో చెప్పబడినవి. వారి ఉపాసనలను శాస్త్రములెందుకు విధించినవని ఎవరైనను ప్రశ్నింపవచ్చును. దానికి అవసరమున్నది. కామప్రేరితులైనవారు దేనినైనను ప్రేమించుటకు అవకాశము కోరుదురు. దేవతలు దేవదేవుని కింకరులుగా పరిగణింపబడినారు. ఈ దేవతలను పూజించువారు క్రమముగా కృష్ణచైతన్యమును వృద్ధిచేసికొనగలరని దీని ఉద్దేశము. కాని, సర్వశాస్త్రములను ధిక్కరించి, ఎదిరించు నంపూర్ణ నాస్తికులకు ఇక ఆశ యేమున్నది? కాబట్టి దేవదేవునియెడ ప్రేమ అన్యదేవతలయెడ ప్రేమతో ప్రారంభము కావచ్చును గదా!

అట్లు కాక మనము మొదటనే సర్వేశ్వరుని ఆరాధన ప్రారంభించినచో అన్యదేవతోపాసన అనవసరము. దేవదేవుని నేరుగా కొలుచువారికి అన్యదేవతలయందుగూడ భక్తియుండును గాని, వారిని కొలువనక్కరలేదు. ఆ దేవతల వెనుకనున్న మహాశక్తి దేవదేవుడేయని వారికి తెలియును. ఆయననే పూజించుటలో వారు నిమగ్నులైయున్నారు. ఎట్లయినను వారి యెడ గౌరవ మనునది యున్నది. దేవదేవుని భక్తుడు చీమను గూడ గౌరవించును; ఇక అన్యదేవతలను గౌరవించునని చెప్పవలెనా? దేవదేవుని అంశములే సర్వభూతములనియు, అవి భిన్న భిన్న పాత్రలను నిర్వహించుచున్నవనియు వారికి తెలియును.



దేవదేవుని సంబంధమున భూతములన్నియును గౌరవింపబడవలెను. కాబట్టి భక్తుడు ఇతరులను "ప్రభు" అని పిలుచును. అనగా, "ప్రియుడవు, గౌరవనీయుడవు అయిన ఓ ప్రభూ!" అని అర్థము. దేవదేవుని భక్తునికి వినయవిధేయతలు లక్షణములు. భక్తుడు దయగలవాడుగాను, విధేయుడుగాను ఉండును. సకలసద్గుణములు కలిగియుండును. సారాంశమేమనగా, ఎవరైనను భక్తుడుకాగానే సకలసద్గుణములును వానియంతట అవియే అభివృద్ధిచెందును. సహజముగా జీవాత్మ పరిపూర్ణుడే. కాని, కామజనిత మాలిన్యమువలన దుర్మార్గుడగును. బంగారములోని ప్రతి ముక్కలోని ముక్కయు బంగారమే. ఈ విధముగానే పరిపూర్ణాత్మయొక్క ప్రతిఅంశము కూడ సంపూర్ణమే.

*ఓమ్ పూర్ణ మదః పూర్ణ మిదమ్ పూర్ణాత్పూర్ణ ముదచ్యతే*
*పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమేవావశిష్యతే*

"సాకారుడైన దేవదేవుడు పరిపూర్ణుడు కాబట్టి వాని నుండి ఉద్భవించిన దృశ్యమాన జగత్తంతయు పరిపూర్ణము. పరిపూర్ణమునుండి ఉద్భవించు ప్రతిదియు పరిపూర్ణమే. అనేకములు తననుండి జనించుచున్నను ఆయన పరిపూర్ణుడే; తననుండి జనించుచున్నను ఆయన పరిపూర్ణుడే; తన పరిపూర్ణత్వమును కోలుపోడు. పరిపూర్ణుడుగానే శేషించును." (ఈశోపనిషద్, ఉపోద్ఘాతము.)

ప్రకృతి సంపర్కజనిత దోషమువలన పరిపూర్ణజీవాత్మ పతనము చెందుచున్నాడు. కాని కృష్ణచైతన్యమార్గము మరల అతనిని పరిపూర్ణునిగ జేయును. తద్ద్వారా అతడు సంపూర్ణానందము పొందగలడు. ఈ భౌతికశరీరము పతనమైన తర్వాత శాశ్వత జీవనము, అక్షయానందము, సంపూర్ణజ్ఞానముగల వైకుంఠమును ప్రవేశింపగలడు.

# పూజ్యశ్రీ ప్రభుపాదుల వారి పరిచయము

పూజ్యశ్రీ ఏ. సి. భక్తివేదాంతస్వామి ప్రభుపాదులవారు 1896వ సంవత్సరమున కలకత్తాలో జన్మించిరి. వారు 1922 లో మొట్టమొదటి సారిగా తమ గురువులైనట్టియు ప్రశస్తభక్తిపండితులైనట్టియు 64 గౌడీయ మఠములను సంస్థాపించినట్టియునగు భక్తిసిద్ధాంత సరస్వతుల వారిని కలసికొనిరి. వారు విద్యాసంపన్నులును యువకులునగు ప్రభుపాదులవారి నెంతయును అభినందించి వైదిక జ్ఞానమును ప్రపంచములో బోధచేయుటకు జీవితము నంకితము చేయుమని యుపదేశించిరి. నాటి నుండియు శ్రీల ప్రభుపాదులవారు వారి శిష్యులైరి. తరువాత 1933లో అలహాబాదునందు దీక్ష గైకొనిరి.

మొట్టమొదటి సమావేశమునందు శ్రీల భక్తిసిద్ధాంత సరస్వతీ ఠాకూర, ప్రభుపాదులవారిని ఆంగ్లేయ భాషాద్వారమున వైదిక జ్ఞానము ప్రచారము చేయుమనిరి. తరువాతి సంవత్సరములలో శ్రీల ప్రభుపాదులవారు భగవద్గీతకు వ్యాఖ్యానము వ్రాసి గౌడీయ మఠమునకు సాయము చేయుటయేకాక 1944లో ఎవ్వరి సాయమును లేకయే ఒక ఆంగ్లేయ పక్ష పత్రికను ప్రకటింప మొదలిడిరి. వారు విషయములను స్వయముగా టైపుచేసి ప్రూఫులను దిద్ది, ముద్రవేయించి, పత్రికా ప్రతులను ఉచితముగ పంచిపెట్టిరి. దానిని ప్రకటించుటకు వారెంతయో శ్రమపడిరి. ఆరంభించిన యా పక్ష పత్రికను ఆపకుండ వారు కొనసాగించిరి. ఇపు డది పాశ్చాత్య దేశములందు వారిశిష్యులచే కొనసాగింపబడుచున్నది.

ప్రభుపాదులవారి వేదాంతజ్ఞానమును, వారిభక్తిని గౌడీయ వైష్ణవులు కొనియాడి వారికి భక్తివేదాంత బిరుదము నొసంగిరి.

1950లో తమ 54వ యేట వారు వైవాహిక జీవితమును విడచిపెట్టిరి. తరువాత నాలుగేండ్లకు వారు వానప్రస్థాశ్రమమును స్వీకరించి ఎక్కువకాలము గ్రంథములను చదువుటకు వ్రాయుటకు వినియోగించిరి శ్రీల ప్రభుపాదులవారు బృందావనమునకేగి యట మధ్యయుగమునందు చరిత్రప్రసిద్ధమైన రాధా దామోదర దేవాలయమునందు అతి నిరాడంబర జీవితములో కాలము గడిపిరి. అటనే పెక్కు సంవత్సరములు విద్యావ్యాసంగము చేసి గ్రంథములు వ్రాసిరి.

1959లో వారు సన్న్యాసాశ్రమమును స్వీకరించిరి. రాధా దామోదర దేవాలయమునందే యుండి వారు తమ జీవిత గ్రంథ రాజమగు శ్రీమద్భాగవతము నందలి 18,000 శ్లోకములకు అనేక సంపుటములుగా అనువాదము వ్యాఖ్యానమును వ్రాయనారంభించిరి. గ్రహాంతర సులభయానము అను మరొక గ్రంథమును గూడ వ్రాసిరి.

భాగవతము మూడు సంపుటములు ప్రకటించిన పిదప ప్రభుపాదులవారు 1965లో తమ దివ్యగురు సందేశమును నెరవేర్చుటకై అమెరికాకు అరిగిరి. అప్పటినుండియు వారు భారతీయ వేదాంతగ్రంథములపై ప్రామాణికములైన వ్యాఖ్యానములు, భాషాంతరీకరణములు, సంగ్రహవ్యాఖ్యలు 70 సంపుటములకు పైగా వ్రాసిరి.

1965లో మొట్టమొదటిసారిగా ప్రభుపాదులవారు న్యూయార్కు పట్టణమునకు వెళ్ళినపుడు వారియొద్ద ఒక పైసాయైనను లేకుండెను. తరువాత ఒక సంవత్సరమునకు అనగా 1966 జులైలో వారు అతి కష్టముపై అంతర్జాతీయ కృష్ణచైతన్యసంఘమును నెలకొల్పగల్గిరి. పది సంవత్సరముల లోపుగనే యా సమాజము విరివిగ అభివృద్ధి చెంది

ప్రపంచవ్యాప్తమై పాఠశాలలు, దేవాలయములు, ఆశ్రమములు మున్నగు వానిని నూటికిపైగా నెలకొల్పగలిగినది.

1968 శ్రీల ప్రభుపాదులవారు న్యూవర్జీనియాలోని కొండల మీద వైదిక పాఠశాలను నెలకొల్పి దానికి నూతన బృందావనమని పేరిడిరి. ఈ నూతన బృందావన మిపుడు వేయి ఎకరముల వైశాల్యముగల ప్రదేశములో విరాజిల్లుచున్నది. అమెరికాలోని వారిశిష్యులు అధికముగా అట్టి సంఘములను స్థాపించిరి.

1972లో పూజ్యశ్రీ ప్రభుపాదులవారు పాశ్చాత్య దేశములందలి డెల్లాస్ టెక్సాస్‌లలో వైదికపద్ధతి ననుసరించి గురుకులములను ప్రవేశ పెట్టిరి. 1972లో ముగ్గురు విద్యార్థులలో విరాజిల్లినది.

శ్రీల ప్రభుపాదులవారు భారతదేశమందలి మాయాపూర్‌లో శ్రీధామమను ఒక అంతర్జాతీయ కేంద్రమును నిర్మించుటకు ప్రోత్సహించిరి. అది వైదిక శాస్త్రప్రవచనమునకు గూడ అనుకూలముగ నిర్మింపబడినది. భారతదేశమునందలి బృందావనములో కృష్ణ బలరామ దేవాలయము ఆ పద్ధతులమీదనే నిర్మింపబడినది. అచట నొక అతిథిగృహము కూడ నిర్మింపబడినది. పాశ్చాత్యులటనుండి వైదికసంస్కృతిని స్వయముగ నేర్చుకొనుట కవకాశము గలదు.

శ్రీల ప్రభుపాదుల వారి ప్రత్యేక ప్రశస్తి, వారు రచించినగ్రంథములపైనే యున్నది. ఆ గ్రంథములలోని భావసైశిత్యము, నిర్దుష్టత, ప్రామాణికత్వము మున్నగువానిని గమనించి, వానిని అనేక పాఠశాలా కళాశాలావిద్యార్థులకు పాఠ్యగ్రంథములుగా నిర్ణయించిరి. వారి పుస్తకములు ప్రపంచములోని 32 భాషలలోనికి అనువాదము చేయబడినవి. 1972లో ప్రభుపాదుల వారి గ్రంథములను ముద్రించి ప్రకటించుటకొఱకే భక్తివేదాంత బుక్‌ట్రస్ట్ అను నొక ముద్రణ సంస్థ నెలకొల్ప



బడినది. అది యిపుడు భారతీయ వేదాంత విషయకములైన గ్రంథముల ప్రకటనకు ప్రపంచ ప్రముఖ సంస్థగా ప్రశస్తినందినది.

వృద్ధులయిన పిమ్మట కూడ ప్రభుపాదుల వారు ప్రపంచమును పదునాలుగు మారులు పర్యటించి ఉపన్యాసము లొసంగియుండిరి. అంత నిర్విరామమైన కార్యక్రమమున్నను ప్రభుపాదులవారు విరివిగా రచనలు సాగించుచునే యుండిరి. వారి గ్రంథములన్నియు కలిసినచో నొక ప్రఖ్యాతవైదిక వేదాంత మత సారస్వత సంస్కృతి గ్రంథాలయము ఏర్పడగలదు.




# హరేకృష్ణ భక్త ప్రణాళిక



మొనరించు కొనుట ప్రతి స్త్రీ పురుషుల ఆదర్శము కావలెను. క్రింద పేర్కొన్న విధి నిషేధములను ...చు ప్రతి వ్యక్తికిని ఈ ప్రణాళికలో పాల్గొనుటకు స్వాగతము.

విధి :

...దపేర్కొన్న హరేకృష్ణ మహామంత్రమును ...పూసలున్న తులసీ జపమాలతో ప్రతి ...ను పదునారు సార్లు జపించవలెను. ...సుమహారాజ్ నిర్దేశము ననుసరించి భక్తి ...నకు సంబంధించిన ఇతర విధి ...లను పాటింపవలెను.

...తము :

...హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే.
హరేరామ రామరామ హరేహరే

...:

...వ్యములు నిషిద్ధములు :

..., పొగాకు, గంజాయి, భంగు, మద్యము తదితర మాదక పదార్థములను సేవింపరాదు.

...క్షణ నిషేధము :

...ు, చేపలు, గ్రుడ్లు, నీరుల్లి, వెల్లుల్లి వంటి తామసిక పదార్థములను సేవింపరాదు.

...నము నిషిద్ధము :

... దాంపత్య జీవితము కాక విధి విరుద్ధమగు ఇతర స్త్రీ పురుష సంపర్కము ఉండరాదు.

...షిద్ధము :

...మగు జూదము గాని, సట్టా వ్యాపారము గాని జరుపరాదు.

...న పేర్కొన్న హరేకృష్ణ మహామంత్రము అంతర్జాతీయ కృష్ణ చైతన్య సంఘపు ఏకైక మంత్రము ; శ్రీమద్భగవద్గీతయు, ...గవతమును మూలభూతమగు శాస్త్రములు

...ా కేంద్రము...లో భగవదున్ముఖము పవిత్రము, ఆధ్యాత్మికమునగు వాతావరణమున ఈ భక్తులు శిక్షణ పొందుదురు.

...గు ఈ భక్తులను భారతదేశపు వైదిక సందేశములను, కృష్ణ భక్తిని ప్రచారము చేయుటకు విదేశములకు పంపు ...వకాశము కూడ కలదు.

వివర... ...ు సమీపములోని ఇస్కాన్ కేంద్రములను సంప్రతింపుడు ; లేక భక్తి వేదాంత బుక్‌ట్రస్ట్, ఇస్కాన్, హరేకృష్ణ ...ండ్, నాంపల్లి స్టేషన్ రోడ్, హైదరాబాద్-500 001 తో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుడు.